# నేను కమ్యూనిస్టు ఎలా అయ్యాను

సంపాదకుడు

ముక్కామల నాగభూషణం

★

ప్రజాశక్తి ప్రచురణాలయం
మొగల్‌రాజపురం
బెజవాడ

# నేను కమ్యూనిస్టు ఎలా అయ్యాను?



సంపాదకుడు
ముక్కామల నాగభూషణం



ప్రజాశక్తి ప్రచురణాలయం,
మొగల్‌రాజపురం, బెజవాడ.

ప్రచురణ నెం. 100
24—2—1946.

# పరిచయం

కమ్యూనిస్టులు తాము ఏ విధంగా కమ్యూనిస్టుపార్టీలోకి వచ్చారో తెల్పుతుంది ఈ పుస్తకం.

కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంతం, నిర్మాణం, శిక్షణ - ప్రతి విషయంలోనూ, ఒక విశిష్టత, ప్రత్యేకత ఉంది. ప్రజలలో పుట్టి ప్రజలలో పెరిగి, ప్రజాసేవే జీవిత పరమావధిగా ఉన్న ఈపార్టీ రోజురోజుకూ అభివృద్ధి చెందుతోంది. కవులు, గాయకులు, డాక్టర్లు, లాయర్లు, కార్మికులు, కర్షకులు — ముదుసలులు, స్త్రీలు, పురుషులు పార్టీలో ఉన్నారు.

కమ్యూనిస్టుపార్టీ ఒక విప్లవకుటుంబం. మన చరిత్రలో, మన రాజకీయ, సాంఘిక ఉద్యమాలలోని ప్రతి సత్సాంప్రదాయం పార్టీలో ఉంది. ప్రతి సాంప్రదాయాన్ని పార్టీ ముందుకు తీసుకుపోతోంది. అన్ని మతాలవారు, అన్ని వర్గాలవారు, అన్ని జాతులవారు, అన్ని వయస్సులవారు, అన్ని వృత్తులవారు పార్టీలో చేరుతున్నారు.

వీటికి నిదర్శనం ఈ పుస్తకం.

— ముక్కామల నాగభూషణం,
సంపాదకుడు.

ప్రజాశక్తి ప్రెస్, మొగల్‌రాజపురం, బెజవాడ.
పర్మిట్ నెం. కె. 13/సి. — 10,000.

## ఐదుకల్లు సదాశివన్

> సత్యాగ్రహమూ, జైళ్లూ, స్కూళ్లూ చూపలేని
> మార్గాన్ని కమ్యూనిజం చూపించింది.

అది 1930 సం॥పు సత్యాగ్రహ మహోద్యమపుసమయం. దేశమంతటా అరెస్టులూ, లాఠీదెబ్బలూ చెలరేగాయి. ప్రభుత్వ దమననీతి ఎంత పెచ్చుపెరిగినా, లెక్కచేయకుండా ప్రజల స్వాతంత్ర్యపిపాస వెల్లివిరిసింది. భారత్‌మాతకు జై, కాంగ్రెసుకు జై, మహాత్మా గాంధీకి జై అనే నినాదాలు దశదిశల మారుమ్రోగుతున్నాయి. తరతరాలనుండి బానిసత్వంలో మ్రగ్గిపోయిన భారతజాతి-ఇక సహించదంటూ సంకెళ్ళను సడలించుకోవడానికై చేసే సింహగర్జనలు మాలాంటి లేతహృదయాలను ఉత్తేజపర్చాయి.

చిన్ననాడే తలిదండ్రులనుగోల్పోయి, జన్మస్థానమైన ఐదుకల్లు" గ్రామం (కళ్యాణదుర్గం తాలూకా) లో బ్రతుకుదెరువు గానక పొట్ట చేతబట్టుకొని అనంతపురం జేరి, గింజలంగడి (ధాన్యపుకొట్టు) లో నౌఖరీ చేస్తున్న నాకు, స్వాతంత్ర్య శంఖారావం వినిపించగానే ఒడలు పొంగిపోయింది. గల్లాపెట్టెమీదినుండి దూకి స్వతంత్రసైన్యంలో కలిశా. త్రివర్ణ పతాకాన్ని చేబూని, నాయకుల వెంటబడి ఊరూరా తిరిగా. జెండాలు ఎగురవేశా. అందరికంటె బిగ్గరగా నినాదా లిచ్చా. ఎన్నిచేసినా పదహారేండ్ల కుర్రవాడి నగుటచేతకాబోలు పోలీసులు అరెస్టుచేయలా.

నాయకులంతా జైళ్ళకుపోతే బయట వుండడం సిగ్గుచేటు. ఎంత చేసినా పోలీసులు అరెస్టుచెయ్యరేం? ఇక జైలుకు వెళ్ళడ మెలాగ?

రాత్రింబవళ్ళూ ఇదే కలవరింత. సరిగా ఆ సమయంలోనే బళ్లారిలో వాలంటీరు శిబిరం పెట్టి వుద్యమాన్ని నడుపుతున్నారని తెలిసింది. అక్కడికెగబ్రాకా. ప్రతిరోజూ వుదయం ప్రభాతభేరీలు, సాయంత్రం ప్రచారాలూ జోరుగా సాగించాం. క్రమేపీ శిబిరంలోని పెద్దలంతా అరెస్టయ్యారు. ఇకమేం తొమ్మిదిమందిం మిగిలాం. నాయకత్వం నాపాలబడింది. వున్నది తొమ్మిదిమందిమే, అయినా ఇనుమడించిన ఉత్సాహంతో కార్యక్రమాన్ని సాగించాం. ప్రభుత్వం గ్రుడ్లురిమింది. పదిహేనుమంది రిజర్వుపోలీసులు వచ్చి మమ్మల్ని తొమ్మిదిమందిని లాఠీలతో చావమోది లారీలకు ఎత్తారు. స్పృహ వచ్చేటప్పటికి జైలుగోడలు ప్రత్యక్షం. ఒకవైపున దెబ్బలబాధ-మరోవైపు అరెస్టుచేశారుగదా! అనే సంతోషం. రాజుగారి ప్రభుత్వంమీద తిరుగుబాటు చేసినందుకు 6 నెలల కఠినసరకమంటూ న్యాయస్థానపుతీర్పు.

జైల్లో ఒకవైపు శ్రీ రాజగోపాలాచారిగారి రాజకీయ శిక్షణ. మరోవైపు సుప్రసిద్ధ లాహోరు కుట్రకేసు ఖైదీలు గయాప్రసాద్, మహావీరసింగులనుండి టెర్రరిస్టు వీరగాధల వినికిడి. అహింసా? సాయుధ తిరుగుబాటా? ఏది స్వాతంత్ర్యానికిమార్గం? ఎటూ తేల్చుకోలేకపోయా. స్వయంగా ఆలోచించి నిర్ణయించుకోవడానికి తగిన పరిజ్ఞానం లేకపోవడమే వూగిసలాటకు కారణమనుకున్నా. తగిన విజ్ఞానాన్ని సంపాదించడానికై చదువు మొదలెట్టా. రాత్రిపూట లైట్లు యివ్వమన్నారు జైలు అధికారులు. లైట్లులేకుండా చదువు సాగించేదెలా? లైట్లు కావాలని పట్టుబట్టా. ససేమిరా అన్నారు అధికార్లు. తొమ్మిదిమందిమి కలిసి లైట్లు యిస్తేనే లాకప్పులోకి వెళతాం, లేకపోతే లేదని భల్లూకపుపట్టుబట్టి బైట కూర్చున్నాం. ఫలితం లాఠీల ప్రయోగం. పెద్ద పెద్ద గాయాలందరికీ తగిలాయి. నా కుడి మణికట్టు విరిగిపోయింది. వీరశైవ లింగాయత కుటుంబంలో పుట్టినవాడనవుటచేత మెడలో కట్టబడిన "లింగము"కూడా ఆ భీభత్సంలో ఎగిరిపోయింది. లింగమూ, లైట్లు తెచ్చియిస్తేనే తిండి తింటా, లేకపోతేలేదని 14 రోజులు ఉపవాసంచేశా. లైట్లు వచ్చాయిగాని లింగము మాత్రం రాలా.

ఇంతలో గాంధీ-ఇర్విను ఒడంబడిక వచ్చింది. జైలునుండి బయిటకువచ్చా. కొద్దికాలంలోనే తిరిగి వుద్యమం ప్రారంభమైంది. ఈమారు హిందూపురం వాలంటీరు క్యాంపుకువెళ్ళా. వాలంటీరు దళాధి

పతిగా నియమింపబడ్డా. చాలామంది అరెస్టయిపోతున్నారు. బహిరంగ పద్ధతులు ప్రయోజనం లేదనుకున్నా. రహస్యంగా ఉద్యమాన్ని నడుప బూనుకున్నా. కాని రహస్య ఉద్యమాన్ని నడుపడానికి తగిన ఎత్తుగడలు తెలియకపోవడంవల్ల అరెస్టు చేయబడ్డా. రాజకీయ పరిజ్ఞానం సంపాదించాలనే కాంక్షకు తగిన కాలవ్యవధి యీసారి దొరికింది. అరవ, కన్నడ, భాషల్లో ప్రావీణ్యత సంపాదించా. గయాప్రసాదువద్ద చేరి ఉరుదు హిందీభాషల నభ్యసించా. కాని భాషలు చదివినంతమాత్రంతోనే రాజకీయ పరిజ్ఞానం కలుగుతుందా?

జైలునుండి బయటకువచ్చా. అంతా అంధకారబంధురంగా ఉంది. ప్రజలు నేను జైల్లుకు వెళ్ళిననాటి ప్రజలుగా కనుపించలా. ఏ మూల చూచినా నిరాశా, నిస్పృహలు గోచరిస్తున్నాయి. కాంగ్రెసు నాయకులు కూడా చప్పచప్పగా కనుపిస్తున్నారు. "స్వాతంత్ర్యమో - చావో" అన్న దీక్షసడలింది. వేడిరక్తపు పొంగులు ఉడుకుతగ్గి చల్లారినాయి. ముప్పది రోజులలో వస్తుందనుకున్న స్వాతంత్రం- మూడేళ్ళయినప్పటికీ రాలా. అయితే స్వాతంత్ర్యం యెలావస్తుంది? ఏమో! అగమ్యగోచరం. ఒకవైపు గయాప్రసాదు చెప్పిన వీరగాథలూ — కార్యాచరణా, స్ఫురణకొస్తున్నాయి. మరోవైపు గాంధిజీ ధర్మబోధలు తలకెక్కుతున్నాయి. కానిమ్మని హరిజనసేవకై నడుం బిగించా. తినడానికి తిండిలేదు. ఉపవాసాలకు లెక్కలేదు. పగలంతా హరిజనులబజార్లు ఊడ్చడం - రాత్రంతా గోనెపట్టా కప్పుకుని సత్రాలలోనిద్రించడం. నెలల తరబడి గడచినా ఇందులో మార్పేమీలేదు. చేతిలో చిల్లిగవ్వలేదు. ఎలా ఈకార్యక్రమాన్ని కొనసాగించడం? స్థానిక కాంగ్రెసు నాయకులవద్ద కెళ్ళా. మార్గమేమిటని ప్రశ్నించా. పోయి ఏదైనా ఉద్యోగంచేసుకోమని సలహాలిచ్చారు. హృదయం కంపించిపోయింది. "స్వాతంత్ర్యమో? చావో? తేలిపోవాలి, పదండిముందుకు" అన్న నాయకులులేనా ఈనాడు ఉద్యోగం చేయమని సలహాలిస్తోంది? నాయకులమీద వున్న విశ్వాసం కాస్తాపోయింది. ఉరవకొండవెళ్లా. గట్టు వెంకటరమణప్పగారికి అండగా నిలబడి హరిజనవీధులు ఊడ్చా. గాంధీ హరిజనహాస్టలు నిర్మాణానికై కృషిచేశా.

ఎన్నిమార్గాలు వూడ్చిబాగుచేసిచూసినా — స్వతంత్రమార్గమేదో కనుపించలా. బందరుకు పయనంకట్టా. రెండుసవంత్సరాలు నేషనల్ కాలేజీలో చదివా. ఆరోజుల్లో దేశమంతటా వర్గసంఘాలమాటగట్టిగా వినబడుతోంది. వర్గసంఘాలలోకి ఆయాప్రజల్ని సంఘటితపరచడం ద్వారానే, జాతీయోద్యమం బలపడుతుందనీ - స్వాతంత్రం సాధించగల మనీ - అతివాదులంతా వాదిస్తున్నారు. ప్రమాదకరమైన పోకడలంటు న్నారు మితవాదులు. నా భావాలు అతివాదరాజకీయాలవైపు మొగ్గసా గాయి. అంతటితో నేషనల్‌కాలేజీని విడిచిపెట్టి రంగాగారి వేసంగిపాఠ శాలకు వెళ్లా. పాఠశాలముగియగానే అనంతపూరు జిల్లాకువెళ్ళి అనేక రైతుయాత్రలు నడిపా. రైతులహక్కులకై ఆందోళనచేశా. ఎన్నిచేసినా ఉద్యమం నిర్మాణరూపాన్ని పొందలా. రంగాగారి పాఠశాలలో నేర్చు కున్నదంతా - ఉపన్యాసాలూ, పత్రికాప్రకటనలూ మాత్రమే. ఆందోళనా దశలో వున్న ఉద్యమాన్ని ఎలాసంఘటితపర్చి, నిర్మాణరూపంలో పెట్టాలో తెలియదు, ఆరంభించిన ఉద్యమం - ఆందోళనాదశలోనే ముగి సింది, అంతకు మించిపోలా.

ఆసమయంలోనే గట్టు వెంకటరమణప్పగారు అనంతపురంవచ్చారు. ఆయనా నేనూ కలిసి "కేశవ విద్యానికేతన" మనే పేరుతో ఒక హరిజన హాస్టలును నిర్మించాం. దానికి నేనే మానేజరుగా ఏర్పాటయా. హరిజన విద్యార్థులకు నీతినియమాలను ఆరోగ్యసూత్రాలను, రాజకీయాలనుబోధిస్తూ, వారితో కలిసిమెలసి హాస్టలులోనే వుంటూవచ్చా. ప్రభుత్వమిచ్చే గ్రాంటు కొంచమైనప్పటికీ ప్రజాదరణవల్ల అనుకున్న దానికంటే మూడురెట్లు అద నంగా వసూలుచేసి, ఆ సొమ్ముతో 45గురు విద్యార్థులను చదివించ గలిగా. "నీతి నియమాల కట్టుబాట్లలో, పరిశుభ్రతలో, చదువు సంధ్యలలో హరి జన బాలురకు చక్కని శిక్షణనిస్తూ, రాష్ట్ర మొత్తంమీద అన్నివిధాలా ఆదర్శప్రాయంగా నడుపబడుతోం దీహాస్టల"ని, ఆలిండియా హరిజన సేవక సంఘ కార్యదర్శి ధక్కరుబాబా సహితం మెచ్చుకున్నారు. తరు వాత "సేవక్" గా నియమించబడి, అనంతపురం, కడపజిల్లాల హరిజన వసతి గృహాలను తనిఖీచేస్తూ, జిల్లా హరిజనసంఘ కార్యదర్శిగా, హాస్టలు మానేజరుగా, రాష్ట్ర హరిజనసంఘ కార్యనిర్వాహక సభ్యుడుగా ఆరేండ్లు పాటు పనిజేశా.

ఈ విధంగా ఎంత కృషిచేసినప్పటికీ, నా లక్ష్యానికి సూటియైన మార్గమేదో నాకు కనిపించలా. అలాంటిమార్గంకోసం వెదకులాడు తూనేవున్నా. హరిజన సేవజేస్తున్న కాలంలోనే, జిల్లాలోని యువక రాజకీయ వాదుల నందరినీ సమావేశపర్చి, జిల్లా యువజన సంఘాన్ని స్థాపించడానికై కృషిచేశా. దానికి నేనే కార్యదర్శిగావుండి పనిచేశా. 1937 నుండి జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సభ్యునిగాను, 5 ఏండ్లు రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడుగాను పనిజేశా; అనేక రకముల అభివృద్ధికర గ్రంధాలు, పత్రికలు తెప్పించి చదివి చర్చించ నారంభించాం. నేషనల్ ఫ్రంటు, 'న్యూఏజి, పత్రికలూ, మార్క్సిస్టు గ్రంధాలూ వచ్చేవి. వాటిని చదివేకొద్దీ-స్వతంత్ర గమ్యస్థానానికి చేరే మార్గాలు స్పష్టంగా కనుపించసాగాయి. ఇంతలో యుద్ధంవచ్చింది. యుద్ధానికి వ్యతిరేకంగా కాంగ్రెసు యిచ్చిన కార్యక్రమమూ, కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన కార్యక్రమమూ, పోల్చిచూచా. కాంగ్రెసుయిచ్చిన వ్యక్తిసత్యాగ్రహకార్యక్రమంనచ్చలా. కమ్యూనిస్టుపార్టీ ప్రకటించే రహస్య పత్రిక 'స్వతంత్రభారత్'ను జిల్లా అంతటా పంచసాగా. క్రమేణా కమ్యూనిస్టుపార్టీలో స్థానం సంపాదించగలిగా. చిన్ననాటినుండీ ఏమార్గంకొరకు తహతహలాడానో - ఆమార్గాన్ని - వివిధభాషలూ, పాండిత్యమూ, సత్యాగ్రహమూ, జైళ్ళూ - స్కూళ్ళూ - ఇవేవీ సరిగాచూపించని మార్గాన్ని మార్క్సిజం చూపించింది. ఉత్సాహంతో వుప్పొంగి ద్విగుణీకృతంగా పనిచేయసాగా. 'ఆకాశవాణి' అనే రహస్యపత్రికనుప్రకటిస్తున్నావంటూ, అరెస్టుచేసి ఒక సంవత్సరం కఠినశిక్ష విధించింది ప్రభుత్వం.

జైలునుండి బయటకువచ్చా. దేశమంతా గందరగోళంగా వుంది. ఫాసిస్టు జపాను భారతదేశ గుమ్మంలో పొంచి కూర్చుంది. ప్రజలలో అలజడీ, అశాంతీ ఎక్కువై, దారీ తెన్నూ తోచకుండావుంది. జాతీయ కాంగ్రెసు యుద్ధముపట్ల సరియైన వైఖరి నవలంబించ లేకపోయింది. క్రమేణా - క్విట్ఇండియా తీర్మానమూ, నాయకుల అరెస్టులూ జరిగాయి. ఉద్రేకపూరితులైన ప్రజలు అరాజక మార్గాలకు దిగారు. తీగెలుత్రెంచడం, పోస్టాఫీసులు, పాఠశాలలు తగులబెట్టడం మున్నగు కార్యాలు చేయసాగారు. ఏవైపుజూచినా లాఠీచార్జీలు, తుపాకికాల్పులు పెచ్చుపెరిగాయి. ఇలా జరిగితే దేశ మేమవుతుందోనని బాధపడ్డా. వెంటనే ప్రజలకూ పోలీసులకూ మధ్య నిలబడి విధ్వంసకచర్యల నాపడానికీ, నాయకుల విడు

దలకూ కృషిచేశా. తాము పన్నిన వుచ్చులో తగులుకోవడంలేదే ప్రజలని విచారపడింది ప్రభుత్వం. వెంటనే అనంతపురం కాలేజీ తగులబెట్టారనే నేరం మోపి మరిముగ్గురు కామ్రేడ్సుతోపాటు నన్నుకూడా అరెస్టుచేసింది ప్రభుత్వం. ఆ కేసు ఒక్కటే చాలదేమోనని కాంగ్రెసు నాయకుల విడుదలకు ఆందోళన చేసినందుకై ఇంకోకేసు పెట్టింది. మూడు నెలలు సబ్ జైలులో వున్న తరువాత రెండుకేసులూ కొట్టివేయ బడ్డాయి.

విడుదలకాగానే తిరిగి రైతుఉద్యమంలో ప్రవేశించా. ఒకవైపు రాజకీయ సంక్షోభం. వేరొకవైపు కరువు కాటకాలు ప్రజల మూలుగుల్ని పీల్చివేస్తున్నాయి. జిల్లా రైతుసంఘ కార్యదర్శిగా వుంటూ—రైతుల అభివృద్ధికీ, కరువు కాటకాలను అరికట్టడానికీ, నాయకుల విడుదలకూ శక్తివంచనలేని కృషిచేశా. "స్వాతంత్ర్య సంపాదనకై - అన్ని దేశభక్త పార్టీలూ - ప్రజలూ కలిసి పోరాడాలనీ, స్వతంత్ర భారత ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని స్థాపించుకోవాలనీ" నా పార్టీ - కమ్యూనిస్టుపార్టీ చెబుతోంది. ఆ లక్ష్యంతోనే అహోరాత్రస్యా పనిచేస్తున్నా.

## నా జ ర్

> కళలమీద ప్రీతి, పేదరికపు బాధ, నాస్థాన
> మెక్కడో చూపించాయి.

పుట్టింది పేద ముస్లిం కుటుంబంలో. నా తాతలనాటినుండి - సన్నాయి వాయిద్యానికై యివ్వబడిన దేవుడు మాన్యం 3½ యకరాలు మాత్రం వుంది. అదైనా మెట్టపొలం. చిన్నప్పటినుండీ సంగీతమంటే — చెవి కోసుకునేవాడిని. నన్ను బాగా చదివించాలనీ—గొప్పవాణ్ణిగా చేయాలనీ— తలిదండ్రుల కోరిక. ఐదోఏట పొన్నెకల్లు (గుంటూరుతాలూకా) బడిలో వేశారు. 4వ తరగతి చదువుతూండగా బడిలో పంతులుగారు వేయించే ఏకాంక నాటికలలో నటించేవాణ్ణి. ప్రధమ బహుమతులు వచ్చేవి.

ఒకనాడు మాచేత నాటకం వేయించాడు మా పంతులుగారు. ఆ నాటకానికి బాలరత్నసభ (తెనాలి)కు చెందిన హార్మోనిస్టును పిలిపించారు. నేను మంచి నటకుడుగా రాణించగలనని తెలుసుకున్నాడా హార్మోనిస్టు. తన కంపెనీ డైరెక్టరుతో చెప్పాడు. వెంటనే నన్ను బాలరత్న సభలోకి తీసుకున్నారు. చదువుకు స్వస్తిజెప్పి కంపెనీలో చేరా.

"నాజర్" అనే ముస్లింపేరు బాగుండదనుకున్నారు గాబోలు; "గోపి" అని మారుపేరెట్టారు. రామదాసులో కబీరు—ఇతర నాటకాలలో స్త్రీ పాత్రలూ ధరించేవాణ్ణి. పొగడ్తలూ, బంగారుపతకాలూ వచ్చేవి. కాని ఖర్చులుగాక నెలకు రు 15/-లు మాత్రం యిచ్చేవారు కంపెనీవారు. 1935 వ సం॥ లో కంపెనీ ఆర్థికంగా చితికిపోవడంతో ఆ రాబడికూడ పోయింది.

నాతండ్రి చాలా నిరుత్సాహపడ్డాడు. చేతిలో చిల్లిగవ్వకూడా లేక, నన్ను అభివృద్ధి చేయడానికి యేమార్గమూ కనుపించక—ఎప్పుడూ దిగులు పడుతూండేవాడు. చివరకు ధైర్యంచేసి నర్సరావుపేటలో సంగీతం పంతులుగారి వద్దకు పంపించాడు. తనరెక్కలకష్టంమీంది ఎలాగో మిగిల్చి నెలకు రు 3/-ల చొప్పున నాకు పంపించేవాడు. పంతులుగారు సంగీతం ఉచితంగా చెప్పబట్టి—ఆ మూడు రూపాయలతోనూ ఎలాగో ఒకలాగు పొట్టపోసుకుంటూ విద్యాభ్యాసం సాగించా. కాని కొన్నాళ్ళకు ఆ మూడు రూపాయల మొత్తంకూడా మోయరాని బరువై పోయింది తండ్రికి. నిరాశ చేసుకున్నాడు—ఏంచేస్తాం? ఇక మానుకో నాయనా! అంటూ కంట తడి బెట్టాడు. నాశరీరమంతా నీరై పోయింది. పంతులుగారు జాలిపడి, తానే తిండిపెట్టి సంగీతం నేర్పుతానన్నారు. ఆరుమాసముల కాలం ఆ విధంగా చెప్పారు. కాని హఠాత్తుగా తండ్రి మరణించాడు. నా నడుం విరిగి పోయింది. గత్యంతరం లేక యింటికొచ్చా.

ఇల్లు గడిచేదారిలేదు. తల్లిని పోషించే బాధ్యత నా మీదే వుంది. "నే నెలాగో బ్రతుకుతాను, నీవుపోయి చదువుకో" మని తల్లి ధైర్యం చెప్ప సాగింది. ఈమారు తాడికొండ సంగీతోపాధ్యాయులవద్ద కెళ్లా తెలిసిన వారవడంచేత పంతులుగారు ఉచితంగానే చెబుతామన్నారు. కాని తిండి సమస్య పెద్దదయింది. వారాలు చేసుకోవడంకోసం ప్రయత్నించినా లాభం లేకపోయింది. సంగీతం, చాలించడమా? సాధించడమా? అన్న సమస్య తీవ్రంగా ఎదుర్కొంది. చివరకు సాధించడానికే నిశ్చయం చేసుకుని "నేను జోలి కట్టుకుంటానండీ"—అన్నా పంతులుగారితో. ఆయన ఆశ్చర్య పోయాడు. పట్టుదల కెంతో మెచ్చుకొని, ప్రోత్సాహకరంగా ఒక అంగవస్త్రాన్నిచ్చాడు.—

ఆ అంగవస్త్రాన్నే జోలి కట్టుకున్నా. ఉదయం, సాయంత్రం ఇళ్ళ వెంట తిరిగా. పాటలు పాడించి పట్టెడన్నం పెట్టేవారు తాండికొండ ప్రజలు. కొన్నాళ్ళయ్యేసరికి మా పంతులుగారివద్దకొక విద్యార్థి వచ్చాడు. ఆయనకూడా నాకు నకలే. కాని భిక్షమెత్తుకోవడం నామోషీగా తోచిం దతనికి. నేనే మరికాస్త బిక్షమెత్తి అతణ్ణికూడా పోషించా. ఈ విధంగా సంవత్సరకాలం గడిచింది.

కడుపునిండా అన్నం దొరుకుతోంది. కాని, కంటినిండా నిద్రలేదు. నా స్థితిని చూచుకుని, నాలో నేనే కుమిలిపోయేవాడిని. "ఎంతకాలం ఇలా బ్రతకడం? తల్లిని పోషించడ మెలా? ఈ సంగీతంలో ఎన్నాళ్ళకు విద్వత్వం సంపాదించగలను? కుటుంబాన్ని పోషించగలిగే స్థితికి ఎప్పటికి రాగలను? అంతవరకూ అడుక్కు-తినవలసిందేనా? నే నడుక్కు-తింటూ జీవిస్తా. కాని, వృద్ధురాలు—తల్లి మాటేమిటి? ఆమెకూడా తిరిపె మెత్తవలసిందేనా? కాదు—కాలుచేతులు తిన్నగావుండి—కష్టించి పొట్టపోసుకోగలిగిన శక్తివున్నప్పుడు-అడుక్కు-తినడం-ఆత్మగౌరవానికిభంగకరం'అనుకున్నా. విరాళతోకూడిన విరక్తితో—సంగీతానికొక సలాంకొట్టి యింటికొచ్చా.

"మడిదున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ" అనే 'పోతన' నీతి జ్ఞాపకమొచ్చింది. అప్పుదెచ్చి రెండు దున్నల్నికొని వ్యవసాయం బెట్టా. ఎంత బండచాకిరి చేసినా, ఫలితంమాత్రం అల్పంగా వుండేది—ఆ కౌలు పేద్యంలో మేపలేక ఒక దున్ననమ్మివేసి, వ్యవసాయం ఎత్తివేశా.

ఇక జీవించడాని కేమార్గమూ కనిపించక కూలికి బయలుదేరా. మిరపకోతలకు, జొన్నకోతలకు వెళితే రోజుకు ఎనిమిదణాలవరకూ గిట్టేది. కాని సంవత్సరం పొడుగునా ఇలాంటి కూలిపని ఎలాదొరుకుతుంది? అంచేత పుగాకు కంపెనీలో కూలికివెళ్ళి ముఠాలోచేరా. మా ముఠాలో ఏబదిమందిమిపనిచేసేవారం. అలసటలేకుండా, పెండెలు కట్టడం వగైరా పనులన్నీ పూర్తిజేసుకుని, సాయంత్రం మా ముఠాజేసిన పనిని గూర్చి వివరంగా లెక్కలు వ్రాసేవాణ్ణి నెలాఖరుకు జూస్తే, కంపెనీ లెక్కకూ - మా లెక్కకూ రు 25/-లు తేడావచ్చింది. కంపెనీలో పని జేసే కూలీలెవరూ స్వంతలెక్కలు వ్రాసుకునేవారుకాదు. కండలు కరిగించి, బండచాకిరిచేసికూడా కంపెనీవారిచ్చిందే మహాప్రసాదమనుకుంటూ కిక్కురు మనకుండా పట్టుకుపోయేవారు. అంచేత నేనువివరంగా లెక్కలు చూపించి, రు 25/-లు విరగగోయడమేమిటని, విలదీసి అడగడాన్ని నంహించలేకపోయాడు కంపెనీ యజమాని. ఈ'జాడ్యమే,? కూలీలందరికీ అంటుకుంటుందేమో ననుకున్నాడు. గుడ్లెర్రజేస్తూ "పనిలోనుండి తొందరగా బయటికి దయచేయండ"న్నాడు.—

చేసేదేమీలేక, రెండోదున్ననమ్మి, కుట్టుమిషన్‌కొన్నా. మిషన్ కుడుతూనే, వూళ్లోపిల్లలకు సంగీతం నేర్పేవాణ్ణి. సంవత్సరం గడిచేటప్ప

టికి రెండువందలు వెనకేశా. కాసినీగాదు—కూసినీగాదు—రెండువందల రూపాయలు. రెండువందలు సంపాదించడమంటే—నాబోటి గర్భదరిద్రు నికి సామాన్యమైన విషయంకాదు. పట్టరాని సంతోషంతో—కష్టార్జితమైన రెండువందలూ బెట్టి—పెళ్ళిచేసుకున్నా.

గారపాడు (సత్తెనపల్లి తాలూకా)లో అత్తవారింటివద్ద వుండగా, చుట్టుప్రక్కల గ్రామాలయువకులతో ఎక్కువగా పరిచయమేర్పడింది. నెలజీతంపద్ధతిమీద, నాటకాలు నేర్పమన్నారు యువకులు. క్రమేణా నెలకు రు 30/-లనుండి-రు 75/-లకు పెరిగింది సంపాదన. సంసారం ఒడుదుడుకులు లేకుండా, సాఫీగా నడచిపోతోంది.

నాటకదళాలను తయారుచేస్తూ, స్వగ్రామమైన పొన్నెకల్లు వస్తూ పోతూవుండగా, పొన్నెకల్లులోని పార్టీసభ్యులతో పరిచయం కలిగింది. నాకు రాజకీయపుస్తకాలూ స్వతంత్రభారత్ పత్రికా, యిచ్చేవారు స్వతంత్రభారత్ చదువుతూంటే కమ్యూనిస్టుపార్టీ కష్టజీవుల పార్టీ యనీ. స్వాతంత్ర్యంకోసం—కూలీరైతుల అభివృద్ధికోసం—ఎడతెగకుండా నిరంతరం పనిచేస్తూన్నపార్టీ యనేభావం కలిగింది. అక్కడి నుంచి ఎక్కువగా రాజకీయపుస్తకాలు చదువనారంభించా. "ఇంకేముంది" కమ్యూనిస్టు పుస్తకాలు మా చదువుతున్నాడు మీ అబ్బాయి. పోలీసులు పట్టుకుపోతారమ్మో!" అని ఎవరోమాతల్లిని భయపెట్టారు. ఒకనాడు గోర్కీ రాసిన "అమ్మ" చదువుతూండగా, గోలచేయడం మొదలుపెట్టింది మా అమ్మ, గోర్కీ "అమ్మ" కూడా తనకొడుకుపావెల్‌నుగూర్చి సరిగ్గాయిలాగే భయపడింది మొదట్లో. ఫరవాలేదులేఅమ్మా! అని మా అమ్మకు ధైర్యం చెప్పి గోర్కీ "అమ్మ"ను పూర్తిగా తెలుసుకున్నా. నా జోలిసంచీ-దున్నల నాగలీ - కూలి చెమటా - కుట్టుపనీ - బుర్రలో ఒకసారి గిర్రున తిరిగాయి. "పావెల్"ను జ్ఞాపకముంచుకున్నా. పార్టీ కరపత్రాలను ఎక్కువగా చదువనారంభించా. క్రమేణా పార్టీఅంటే అభిమాన మెక్కువయింది.

1942 సం॥ లో పార్టీమీద నిషేధం తొలగింది. చీకటులను చీల్చు కొని వెలుగులోకొచ్చింది పార్టీ. కొన్నాళ్ళకు తాళ్ళూరులో జరిగిన గుంటూరు తాలూకా యువజన మహాసభకు హాజరయి, పాటలపోటీలో పాల్గొన్నా. ప్రథమ బహుమతి వచ్చింది. తరువాత 1943 లో తెనాలిలో జరిగిన జిల్లాపార్టీ మహాసభకూ, గుంటూరుతాలూకా పార్టీసభకూ, వెళ్ళా.

ఆ సభల్లో పాటలుపాడా; పార్టీసభ్యులు ప్రదర్శించిన వివిధరకముల ప్రదర్శనములను చూచా. అవి నన్నెంతో ఉత్తేజ పరిచాయి. వివిధ కళా రూపాలను ప్రదర్శించవలసింది పొట్టకోసం కాదనీ, ప్రజలకోసమనీ, తెలుసుకున్నా. ఇంతవరకూ నేనాడిన నాటకాలకూ, పార్టీ సభ్యులిచ్చే ప్రదర్శనాలకూ, వున్న తేడాను గ్రహించా. నేనాడిన నాటకాలలోలాగా వీటిలో భగవంతుని సాక్షాత్కారాలు లేవు. కైలాస మసలేలేదు. కాని మానవ ప్రపంచముంది. వివిధ కళారూపాలను అభివృద్ధిపరచి, వాటిద్వారా ప్రజా సామాన్యంలో చైతన్యాన్ని పెంపొందించాలనే కమ్యూనిస్టుపార్టీ ఆశయాన్ని తెలుసుకున్నా, చిన్ననాటనుండీ కళలంటేనాకున్న ప్రీతి - నిరుపేద లనుభవించే కష్టాల అనుభవం - నా స్థాన మెక్కడో చూపించినయి. వెంటనే పార్టీలో చేరా.

వివిధ రకముల ప్రదర్శనలు నేర్చుకొని ప్రదర్శించా. తోటికామ్రేడ్స్ బుర్రకథలు చెబుతున్నారు. నేనుమాత్ర మెందుకు చెప్పగూడదనే పట్టుదల కలిగింది. కామ్రేడ్స్ రామకోటి, పురుషోత్తములను కలుపుకొని బుర్రకథ లను సాధనచేశా. క్రమేణా "బెంగాలుకరువు" బుర్రకథరాసా. యీ బుర్రక థలద్వారా యింతవరకూ, మా దళమొక్కటే ఆరులక్షలమంది ప్రజలలోకి స్వాతంత్ర్యసందేశాన్ని తీసుకువెళ్ళగలిగింది. ఈ విధంగా ప్రజాసేవచేసే భాగ్యం నాకు కలిగించింది పార్టీ.

నాట్యకళా ప్రపూర్ణ శ్రీ బళ్లారి రాఘవాచార్యులుగారు బాపట్లలో కథవిని, అమితానందంతో ఆశీర్వదించారు; బళ్లారికి ఆహ్వానించారు. మద్రాసు ప్రదర్శనలలో డాక్టరు గోవిందరాజుల సుబ్బారావుగారు కౌగలించు కొని "హరిప్రసాదరావును జ్ఞాపకం చేశా"వన్నారు. అనేకమంది ప్రముఖు లీవిధంగానే పొగిడారు. పూట కూటికి గతిలేని పేద ముస్లిం కుటుంబంలో పుట్టిఅష్టకష్టాలు పడిన నాకు చిన్ననాటినుండీ ఎన్ని నాటకాలాడినా, ఊరూ పేరూలేని నాకు - యిన్నిగౌరవ మర్యాదలు ఎలా కలుగుతున్నాయి? ఎలా ప్రజాసేవ చేయగలుగుతున్నాను? నాకు రాజకీయాలు నేర్పి, చైతన్యం కలిగించి, అన్నివిధాలా అభివృద్ధిచేసి - కష్టజీవులపార్టీ - కమ్యూనిస్టు పార్టీ నా జీవితాన్ని తీర్చి దిద్దింది కనుకనే.

కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్

## వి. వి. నరసింహం

కష్టజీవుల పార్టీ - కమ్యూనిస్టు పార్టీ
ఇదీ నా జీవితానుభవం.

1857 వ సం॥పు సిపాయి విప్లవం అణచివేయబడ్డ తరువాత 1906 వ సం॥ వరకూ పెద్దయెత్తున ప్రజాందోళన భారతదేశంలో జరుగ లేదు. బ్రిటిష్ ప్రభుత్వం బెంగాల్‌ను రెండుగా చీల్చడంతో బెంగాల్లోవి ప్రజలంతా-హిందువులూ - ముస్లింలూ ఏకంగా నిలిచి, ఐక్య బెంగాలుకై పోరాడసాగారు. బెంగాల్ ప్రజల పోరాటంతో దేశమందన్నిరాష్ట్రాల లోనూ సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమం - జాతీయ చైతన్యం - బయలు దేరాయి ఆ సమయంలో "వందే మాతరం" ఉద్యమాన్ని నడపిన లోకమాన్య బాలగంగాధర తిలక్ విశాఖపట్నం వచ్చారు. మా స్వగ్రామ మైన "అల్లిపురం"నుండి వారిని చూడాలని విశాఖపట్నం వెళ్ళాము. కుర్రవాడి నవడంచేత ఆయన చెప్పినదేమీ తెలుసుకోలేకపోయినా,. 'వందే మాతరం' మాత్రం గట్టిగా లంకించుకున్నా. క్రమంగా 1 వ ఫారం చదువుతుండగా అనిబిసెంటమ్మగారి ఉపన్యాసాలుకూడా విన్నాను. తరు వాత నా కింగ్లీషు చదువంటే వ్యతిరేకత పుట్టింది.

చదువుమానేసి ఎ. వి. ఎన్. కాలేజీలో వడ్రంగం పని నేర్చుకో సాగాను. కొన్నాళ్లు నేర్చుకున్న తరువాత 'ఖరగ్‌పూరు'కు వెళ్ళి అక్కడ రైల్వే వర్కుషాపులో ప్రవేశించాను. ఆ రోజులలో వర్కు షాపులో లంచగొండితనం విపరీతంగా వుండేది.

రైల్వేకార్మికులు సహించరాని పరిస్థితులలో జీవించవలసి వచ్చేది. తక్కువ జీతాలు, ఎక్కువగంటలపని, మితిలేనిలంచాలు - వీటితో కార్మికుల రక్తాన్ని జలగల్లాగా పీల్చేవారు అధికార్లు. నాకీ అన్యాయాలను అరికట్టాలనే పట్టుదల కలిగింది. వెంటనే సోదర కార్మికులతో సంప్రదించినమీదట, అధికారుల అన్యాయాలను, సంఘబలంతో మాత్రమే ఎదుర్కోగల మని విశ్వసించి - కార్మికసంఘాన్ని నిర్మించాను. ఆరోజుల్లో సంఘాన్ని నిలబెట్టడమంటే సామాన్యమైన విషయంగాదు. సంఘాన్ని ధ్వంసఃచేయడానికి అధికార్లు ఎన్నోఎత్తులువేశేవారు. మితిలేని కష్టాలు తెచ్చిపెట్టేవారు. ఎన్నికష్టాలు వచ్చినా సరే - పట్టు విడువకూడదనుకున్నాను. సోదర కార్మికుల అండతో - సంఘబలాన్ని పెంపొందించుకుంటూ - అధికారుల అక్రమాలను, అరికడుతూ పోరాడగలిగాను.

కొంత కాలమైనతరువాత ఖరగ్‌పూర్‌వదలి, బెజవాడ రైల్వే వర్కుషాపులో పని జేయసాగా. ఇంతలో 1930 ఆర్థికమాంద్యం వచ్చి పడింది. ఒకవైపున సత్యాగ్రహసమరం - వేరొకవైపున కార్మిక కర్షకుల కష్టాలు - దేశమంతటా అలజడీ, ఆందోళనా ఎక్కువైనాయి. దేశమంతటా బ్రహ్మాండమైన కార్మికసమ్మెలు జరిగాయి. ఆసమయంలో బెజవాడ బ్రాంచి కార్యదర్శిగా రైల్వేకార్మికుల హక్కులకొరకు ఎడతెగని కృషిజేశాను.

1935 వ సం॥లో యం. అండ్ యస్. యమ్. రైల్వేవర్కర్సు అండ్ ఎంప్లాయీస్‌యూనియన్ మహాసభ పెరంబూరులో జరిపాం. ఆసభలో మొదటసారిగా కామ్రేడ్ సుందరయ్యతో పరిచయం కలిగింది. ఆయనతో రైల్వేకార్మికుల సమస్యలనుగూర్చి చర్చించాను. అప్పుడాయన "కేవలం ఆర్థికపోరాటాలు నడిపినంతమాత్రంతో, కార్మికుల కష్టాలు పూర్తిగాకడతేరవనీ ; ఆర్థికపోరాటాలద్వారా కార్మికులను సంఘటితపరచి వారిపూర్తిరాజకీయ చైతన్యాన్ని-వర్గచైతన్యాన్నివృద్ధిచేయాలనీ; స్వతంత్ర పోరాటానికి అండగా నిలబడి స్వాతంత్ర్యాన్ని సాధించగలిగితేనే, దేశీయ విదేశీయ పెట్టుబడిదారీ కంపెనీల దోపిడినుండి విముక్తిజెంది, కార్మికులు సుఖపడతారనీ" వాదించాడు. ఆ వాదన నాకెంతో నచ్చింది. కామ్రేడ్ కె. యల్. నరశింహంగారితో కలిసి కార్మికులమధ్య రాజకీయప్రచారం చేస్తూ - వారిహక్కులకై పోరాడుతూవచ్చా.

ఇంతలో మద్రాసు అసెంబ్లీ ఎన్నికలొచ్చాయి. కార్మికస్థానానికి కాంగ్రెసు నన్ను నిలబెట్టింది. కార్మికుల ఆదరాభిమానాలతో కాంగ్రెసు M. L. A. నయ్యా. కాంగ్రెసు మంత్రివర్గం అధికారంలో కొచ్చింది. కార్మికులకష్టాలు పోగొట్టడానికి మంత్రివర్గం ముందుకొస్తుం దనుకున్నా. కాని నా ఆశలు అడియాసలయ్యాయి. కార్మిక సమ్మెలకు వ్యతిరేకంగా మాటాడసాగాడు కార్మికమంత్రి వి. వి. గిరి. చీరాల, చిట్టివలస కార్మికులపై కాల్పులు జరిగాయి. కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే కార్మికులకండగా నిలబడి పోరాడింది. నోరుమెదపడానికి వీలులేకుండా క్రమశిక్షణ పేరుతో మా నోళ్ళు నొక్కివేయబడ్డాయి. నిరుత్సాహమూ. అసంతృప్తి నాలో ఎక్కువైంది.

భారతీయుల యిష్టం లేకుండానే బ్రిటిష్ సామ్రాజ్యవాదం. దేశాన్ని యుద్ధగుండంలోకి తోయిడం, కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామాలిచ్చి అసమ్మతి ప్రదర్శించడం జరిగింది, ప్రజల్లో సామ్రాజ్యవాద వ్యతిరేకత, యుద్ధవ్యతిరేకత, పెచ్చుపెరిగింది. పోరాటం కావాలనేకోర్కె ప్రబలింది, వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించింది కాంగ్రెసు. నాకు నచ్చలా. రహస్యంగా పనిచేస్తున్న కమ్యూనిస్టుపార్టీ సమిష్టిపోరాటానికై సాగించే కృషి నన్నాకర్షించింది. కమ్యూనిస్టుపార్టీ పాలసీ సత్వర స్వాతంత్ర్య సిద్ధికి మార్గమని గాఢంగా నమ్మాను. పార్టీపాలసీ ననుసరించి పనిచేస్తూ 1941 వ సం॥లో పార్టీ సభ్యుడుగా చేరాను.

నాటినుండి నేటివరకు పార్టీపాలసీ ననుసరించి కార్మికుల్లో పని చేస్తున్నాను. కార్మికుల చైతన్యం చూస్తోంటే నాలో ఉత్సాహం ఎక్కువవుతోంది. పార్టీ నాకిచ్చే కొద్దిపాటి పనినీ సక్రమంగా పూర్తిజేసి, ఇంకా ఎక్కువపనిని ఇవ్వమని పార్టీని అడుగుతున్నా. కార్మికులంతా ఆప్యాయనంగా నన్ను "తాతా!" అని పిలుస్తున్నారని కాబోలు? నీవు ముసలివాడవు, ఇంతవరకు చేస్తే చాల్లే" అంటోంది పార్టీ. విప్లవ చైతన్యానికి ముసలితన మెక్కడుంది?

## పుత్పల పార్వతీదేవి

> వీరేశలింగం పంతులూ, గాంధీ మహాత్ముడూ
> మున్నగు పెద్దలు చూపిన మార్గాన
> ముందుకు పోతోంది కమ్యూనిస్టుపార్టీ.

మొదట్లో చేనేత బట్టల వ్యాపారంచేసే మధ్యతరగతి కుటుంబం మాది. మా కుటుంబంలో దైవభక్తి మెండు. మడి. తడి పూజలతోనే మా కాలం గడచింది. పునర్జన్మ లేకుండా తరించడానికి మార్గం దైవభక్తేనని, నా భర్తగారు మా 'ఉప్పాడ' గ్రామం (తూర్పుగోదావరిజిల్లా)లో శైవ దేవాలయాన్ని కట్టించి, దేవీ ప్రతిష్ఠాపన చేయించారు.

మా గ్రామంలో వున్న మా కులంవారంతా మాంసాహారులు. మా కుటుంబ మొక్కటే శాకాహార కుటుంబం. అందుచేత పల్లకిలమీద ఊరేగే కులగురువులంతా ఆతిథ్యంకోసం మాయింటికే వచ్చేవారు. గురువులు రావడం ఎక్కువయ్యేకొద్దీ, మా జపాలు, తిపాలుకూడా ఎక్కువయిపోయాయి. ప్రతిసంవత్సరం వినాయకచవితికీ, దసరాకు, నవరాత్రుల పూజలూ, సంతర్పణలూ, ఊరేగింపులూ జోరుగా జరిపించేవారం.

1920 - 21 సహాయ నిరాకరణోద్యమపు రోజులొచ్చేయి. గాంధీగారు ఆంధ్రదేశమంతా సంచారం చేసేరు. నేను, నా భర్తగారు ఆ మహాత్ముని దర్శనం చేసుకోవడంకోసరం వెళ్లాం. మూరెడు కొల్లాయిగుడ్డ ధరించి బోసినోటితో చిరునవ్వు నవ్వుతూన్న మహాత్ముణ్ణిచూస్తే, ఆయన పురాణపురుషుడనిపించింది మాకు. మేం దర్శనం చేసుకోగానే "తిలక్ స్వరాజ్యనిధి కేమన్నా యిమ్మ"ని చేయిజాపారు మహాత్ములు. నా భర్తగా

రాయన వద్దనున్న రు 116 లు యిచ్చారు. నేను నా చేతి బంగారుగాజుల జతలు సమర్పించాను.

మా కుమారుడు సత్యనారాయణకూడా మాకు తీసిపోలా. వున్నది ఒక్కగానొక్క కొడుకే గనుక బాగా ఇంగ్లీషు చదివించాలనుకునేవాళ్లం మేం. గాంధీగారు స్కూళ్లూ, కాలేజీలూ బహిష్కరించమన్నారని ఇంగ్లీషు చదువును విడిచిపెట్టేసాడు మా అబ్బాయి. అప్పటినుండీ మా కుటుంబం కాంగ్రెసంటే భక్తి, తాత్పర్యాలు గలిగిన కుటుంబంగా మారిపోయింది.

1930 లో ఉప్పుసత్యాగ్రహ శిబిరం మా ఉప్పాడలో స్థాపించారు. స్థానికంగా నాయకత్వం వహించి పోరాటాన్ని నడుపుతున్నాడని నా కుమారుని మాత్రం అరెస్టుచేసి 6 మాసములు శిక్ష విధించారు. శిక్ష లెక్కువయ్యే కొద్దీ సత్యాగ్రహ ఉప్పును కొనడమంటే ప్రజలు భయపడిపోయారు. కాని నేనూ; నా భర్తగారూ మాత్రం ధైర్యంగా కొనేవారం. నా భర్తగారు జైలుకుకూడా సిద్ధమయ్యారు. గాని ఎందుమూలానో అరెస్టు చేసినారు కాదు.

జైల్లో నాకుమారునికి తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారిద్వారా టాల్‌స్టాయి గ్రంధాలు దొరికేవట. వాటిని బాగా చదివేవాడట నా కుమారుడు. అందువల్ల 1931 లో జైలునుండి బయటకురాగానే మాకు టాల్‌స్టాయి గ్రంధాలు చది వినిపించసాగేడు. ప్రతిరోజూ కుటుంబమంతా కూచొని గంటలకొద్దీ టాల్‌స్టాయి గ్రంధపఠనం సాగించేవారం. పురాణకాలక్షేపం బదులు, ఈ కాలక్షేపం ఏర్పడిపోయింది మాకు.

ఇంతలో గాంధీగారు హరిజనోద్ధరణకై ఉపవాసం చేసేరు. మా కుటుంబమంతా హరిజనసేవలో మునిగిపోయింది. 'వ్యక్తిఆస్తి' లేకండా అంతా ఆశ్రమానికిచ్చివేసి, కుటుంబమంతా ప్రజాసేవ చేస్తుండాలని సూచించాడు మా కుమార్డు. వెంటనే నా భర్తగారు పదివేల రూపాయల కిమ్మతుగల ఇల్లు, పొలం, తోట, స్థిరాస్థి— ఒక వేయిరూపాయిలు కిమ్మతుగల చరాస్థి యిచ్చి 'సేవాశ్రమం' స్థాపించారు. నేను నావంద కాసుల బంగారు నగలూ అమ్మి రెండువేల రూపాయిలు ఆశ్రమాని కిచ్చాను:—

ప్రతిరోజూ హరిజనపేటల కెళ్ళడం, అవిద్దలకు స్నానంచేయించి ఫలహారాలు పెట్టడం, హరిజనులతో కలిసి సహపంక్తి భోజనం చేయ

శం, నావని. ఇలాగ హరిజనసేవ చేస్తున్నామని, మా ఊళ్లో వాళ్ళంతా మమ్మల్ని బహిష్కరించారు. నా అన్నా, అక్కా మొదలైన తోడబుట్టిన వాళ్ళుగూడా మాయింటికి రావడం మానేసేరు. ఊళ్లోవాళ్ళంతా కలిసి మాకు చాకలిగుడ్డలుతక్కుండా, వైద్యుడు వైద్యంచేయకుండా, మాన్పిం చారు. చివరకు 'గాజులబల్జి' గాజులమ్మడానికూడా తిరస్కరిస్తే, పౌరు గూరుబోయి కొనితెచ్చుకునేదాన్ని. ఈ విధంగా ఎన్నికష్టాలొచ్చినా చలించ కుండా "హరిజన సేవే హరిసేవ"ని, గాంధీమహాత్ముణ్ణి తలుచుకుంటూ మాపని మేము చేసుకుపొయ్యేవారం:—

1932 లో రాష్ట్రసత్యాగ్రహ మహిళాదళంలో పనిచేయడానికిబయటి జిల్లాలకు వెళ్ళేను. కొన్నాళ్లు పనిచేసినతరువాత, ఇంటివద్ద భర్తకూకుమా రునికీ వండిపెట్టేవారెవరూ లేకపోవడంవల్ల వెళ్ళిపోయొచ్చాను—

శారదాచట్టం అమలులోకి వచ్చినా, బాల్యవివాహాలు మామూలుగానే జరుగసాగాయి, అన్నెం పున్నెమెరుగని బాల వితంతువులు, చచ్చినట్లు పడివుండి సమాజానికి బలైపోవాలనేవారు చాలామందున్నారు దేశంలో. కాని మేము వీరేశలింగం పంతులుగారు చూపించిన పవిత్రమైన ఆదర్శా లను అవలంబించాలనుకున్నాం. మా ఆశ్రమంలో అనేకంగా వితంతు వివాహములు చేయించాం. ఒకనాడు మా గ్రామంలోని బాల వితంతు వును రహస్యంగా మరోగ్రామానికి తీసుకువెళ్ళి పెళ్ళి చేయించవలసి వచ్చింది. ఎలాగనైతేనేం కష్టపడి పెళ్ళిచేయించాం. ఈ వార్త తెలియ గానే ఆ అమ్మాయి బంధువులంతా కర్రలుపుచ్చుకొని మమ్మల్ని చంపుతా మంటూ ఆశ్రమంమీదికొచ్చారు. ఇల్లు తగులబెడతామనీ, బైటకు ఈడ్చి కొడతామనీ అల్లరిచేయసాగారు. అప్పుడు నేనూ, నా భర్తగారుమాత్రమే ఆశ్రమంలో వున్నాం. సంఘ సంస్కరణకోసం ఆహుతి అవడానికి సిద్ధ పడ్డాం మేం. కాని యింతలో కొంతమంది ప్రజల జోక్యంవల్ల అల్లరి మాని వెళ్ళిపోయారు.

1940 నుండీ రహస్యంగా పనిజేస్తూన్న కమ్యూనిస్టులు మా యింటికి వస్తూ పోతూ వుండేవారు. వారివల్ల అనేక విషయాలు తెలుసు కునేదాన్ని. హరిజనుల కష్టాలూ, సమాజంలో స్త్రీలనుభవిస్తూన్న కష్టా లనుగురించీ ప్రశ్నలు వేసేదాన్ని. కేవలం సంస్కరణోద్యమంద్వారా వారి కష్టాలు పోగొట్టడం సాధ్యంకాదనేవారు కమ్యూనిస్టులు, చివిగిన

గుడ్డను ఎంతగా కుట్టి బాగుచేసినా, మళ్ళీ చివికి పాడై పోతూనే వుంటుందనీ, ఉదాహరణలు చూపేవారు. ఆర్థిక,సాంఘిక, రాజకీయాలలో అందరికీ సమాన హక్కులు కలగజేస్తేనేగాని - హరిజనుల, స్త్రీల, కష్టాలు పోగొట్టి - సుఖప్రదమైన సమాజాన్ని నిర్మించడం సాధ్యంగాదనేవారు. గాంధీమహాత్ముడూ, వీరేశలింగం పంతులూ మున్నగువారు కోరిన అభివృద్ధికి అచరణయోగ్యమైన మార్గం కమ్యూనిస్టులు చూపించినందుకు సంతోషం కలిగింది నాకు.

అప్పటినుండీ మహిళా వుద్యమమన్నా, చేనేత పారిశ్రామికోద్యమమన్నా, కూలీఉద్యమమన్నా, నాకెంతో అభిమానంగా వుంటుంది. మొదటి నుండీ కాస్తో, కూస్తో ప్రజాసేవ చేసినదాన్ని గనుక, ఇంట్లో కూర్చోవడం కంటే మహిళా ఉద్యమంలో పనిచేయడం మేలనిపించింది. ఉద్యమంలో పని చేయడమంటే పెళ్ళిళ్లు చేయడమో హరిజన బాలురకు మిఠాయీలు పంచడమో కాదుగా? ఎన్నో విషయాలు తెలియాలాయె. ఎలాగ తెలుసుకోడం? రాష్ట్ర కమిటీ బెజవాడలో నడిపిన మహిళా స్కూలుకువెళ్ళి విషయాలు తెలుసుకోవా లనుకున్నాను. 60 ఏండ్లొచ్చి, చావుకుసిద్ధమయిన ముసలిదానను స్కూలుకువెళ్ళడ మేమిటనే అనుమానం కలిగింది. అయినా "ప్రజా సేవకు ముసలితనమేమి" టన్న గాంధీగారి మాటలు గుర్తుకొచ్చి మహిళాస్కూలుకు వెళ్ళేను.

స్కూలులో అనేక విషయాలమీద పాఠాలు జెప్పేవారు. వృద్ధాప్యం వల్ల సరిగా అర్థం చేసుకోలేకపోయేదాన్ని. అంచేత రాత్రిళ్ళు లాంతరు పెట్టుకొని ఇతర మహిళలతో పాఠాలు చెప్పించుకునేదానను. ఈ విధంగా మానంరోజులు బెజవాడలో వుండి కొంతవరకు మహిళా సమస్యలను, రాజకీయాలను తెలుసుకోగలిగాను. ఆ స్కూల్లో నా కెంతో ముచ్చటగా వుండేవి. అన్నిటికన్నా, ఆ స్కూలుకు వచ్చిన మహిళల పట్టుదలా, క్రమశిక్షణా నాకెంతో సంతోషం కలిగించాయి.

ఈ విధంగా మహిళల అభివృద్ధికోసం పాటు బడుతూన్న కమ్యూనిస్టుపార్టీని ఈనాడు తెలిసికొందరూ, తెలియక కొందరూ అడిపోస్తున్నారు. నా కుమారుడూ వాళ్ళూ ఈ నిందలనువిని ఎంతో కించపడుతూంటారు. కాని నేనేమీ కించపడను. వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమాన్ని సరిగా యిలాగే నిందించేరు వ్యతి

రేకులు. స్త్రీలుకూడ దేశసేవకై ముందుకు రావాలన్న మహాత్ముని పిలుపందుకొని. స్వతంత్ర పోరాటంలో కురికిన స్త్రీలనుకూడా వ్యతిరేకులిలాగానే నిందించేరు. అందువల్ల ఆ ఉద్యమాలేమి కుంటుబడాలా. ముందుకే పోయినాయి. వ్యతిరేకులకు మాత్రం నోళ్ళు కట్టుడాయి. అలాగే ఆ వీరేశలింగం పంతులూ. మహాత్ముడూ. మున్ముగువారి ఆశయాలను ముందుకుతీసుకుపోతూ న్యాయంకోసం సత్యంకోసం పోరాడుతూన్న కమ్యూనిస్టు పార్టీని నిందించేవారి నోళ్ళుకూడా తొందరలోనే నొక్కుకుపోతాయి. నిందల ద్వారా అభివృద్ధిని అరికట్టడం సాధ్యంకాదనేది స్థిరసత్యం. అందుకు నాబోటి ముసలివాళ్ళంకూడా పార్టీలో చేరడమే సాక్షి. అరవైయేండ్ల ముసలిదాననైనప్పటికీ ఓపినకొలదీ మహిళాసేవ చేస్తున్నాను.

నా కుమారుడు సత్యనారాయణ బాలాకాలంనుంచీ పార్టీసభ్యుడుగా వుంటున్నాడు. ఈనాడు ఆంధ్రరాష్ట్ర చేనేత పారిశ్రామిక సంఘానికి అధ్యక్షుడుగా పనిచేస్తున్నాడు. నాకు తెలిసినంతవరకూ వివిధ విషయాలను మహిళలకు చెప్పుతూ. మహిళా సంఘంలో సభ్యురాండ్రుగా చేర్పిస్తూ. ఓపినంతమట్టుకు ప్రజాసేవ చేస్తున్నానుగదా యని సంతోషిస్తున్నాను

## నాగభైరవ శివరామకృష్ణయ్య

> సాహిత్యాన్నీ, కళల్నీ, ప్రజలపరం చేయడానికి పార్టీచేసే కృషి నన్నుత్తేజ పరిచింది.

నా సంగతి నాకంటే యితరులకు బాగా అర్థమయ్యే రోజుల్లో నాకు యే సంఘంతోనూ సంబంధముండేదిగాదు. వున్న సంబంధమంతా నన్ను పోషిస్తూ, వాళ్ళకు భిన్నంగా నడచినప్పుడు దూషిస్తూ, నామీద పెత్తనం చలాయించే మా పెద్దలతో వుండేది. మావాళ్ళకు తెల్లవాళ్ళంటేనూ, ఇంగ్లీషు భాషంటేనూ, మహాకడుపుమంటగావుండేది. అందువల్ల నన్నొక సంస్కృత పండితునకు శిష్యపరమాణువుగా తయారుచేశారు. అక్కడనుంచి దానితో కసరత్తు ప్రారంభించాను. న్యాయంగా సంస్కృతంలో దేవుడు మూర్తీభవించి గడ్డకట్టుకుని వుంటాడని ప్రతీతి. నాకు మాత్రం అది చదివిన కొద్దీ, క్రమక్రమంగా దేవుడిమీద నమ్మకంపోయి, ఆస్తికులతో—నాస్తికుణ్ణిగా పోట్లాడడం ప్రారంభించాను.

కొన్నాళ్ళకు మిత్రుల ప్రోత్సాహంతో మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలకు వెళ్ళాను. అక్కడ నెలరోజులపాటు అర్థశాస్త్రం, చరిత్ర, భూగోళం, రైతుఉద్యమం, కార్మికోద్యమం, నిర్మాణం, పరిణామవాదం మొదలైనవన్నీ మార్క్సిస్టు దృక్పథంలో బోధించారు. ఉపాధ్యాయులు కామ్రేడ్స్ సుందరయ్య, శివయ్య ప్రభృతులంతా సమర్థులు. కామ్రేడ్స్ జోషి, డాంగే మున్నగు వారువచ్చి ఉపన్యాసాలిచ్చారు. కాని వాటిని జీర్ణించుకోగలిగిన రాజకీయ స్థాయి నాలోలేదు. ప్రజాఉద్యమాలతో సంబంధముండి అప్పటికే కొంత రాజకీయచైతన్యమున్న చాలామంది విద్యార్థులు బాగా జీర్ణించుకోగలిగారు. వర్గపోరాటాలూ, పరిణామవాదమూ కొంతవరకు అర్థంచేసుకో గలిగా. సోషలిజమంటే ఒక విధమైన అభిమానం ఏర్పడింది. పేదల బాధలను గురించి, దేవుడు పేరుతో

జరిగే అన్యాయాలనుగురించీ, ఆవేశంతో అస్పష్టంగా "వెలుగురవలు" అనే చిన్న గ్రంధాన్ని వ్రాశాను. దాన్తో నిరంతర దైవభక్తులయిన మా గురువుగారు "కవిత్వంలోనూ, రాజకీయాలలోను, పడితే పరీక్ష తప్పు తావం"టూ, వుగ్రులయ్యారు. నేను భయపడి నా పుస్తకం గురువుగారికే అంకిత మిచ్చాను. శిష్యుని భక్తికి సంతోషించారువారు, గురుకట్నం చెల్లిందని సంతోషించాను నేను. కాని ఆశ్చర్యమేమంటే ? దేవుడులేడనే పుస్తకానికి, దేవుణ్ణి హృదయమందిరములో చిత్రించుకున్నవారు, కృతి పతిగావడం. ఈ విధంగా గురువుగారు శాంతించారు. ఇక మా పెద్దలకు పుస్తకంలో వున్నవిషయంతో సంబంధములేదు. నేను కవినైనానని సం తోషించి పుస్తకానికి కావలసిన ధనసహాయమంతాచేశారు.

ఇంతలో యుద్ధం వచ్చింది. విద్వాన్ పరీక్షకు చదువుతూనే యువకసింహమనే పుస్తకంవ్రాశాను. అందులో పరప్రభుత్వంమీద కలి గిన అసంతృప్తి, అసహ్యతా మాత్రమేవుంది. అందులో ఏదోఉందని ఎవరో కొందరుచెపితే, చెవులుతప్ప కళ్ళులేని ప్రభుత్వం, పట్టుదలతో ప్రయత్నించి, అరదస్తా తెల్లకాయితాలు, పాతచొక్కాలూ వగయిరాలతో నిండివున్న నాపెట్టెమాత్రము పట్టుకెళ్ళారు. పుస్తకం మాత్రం వాళ్ళకు దొరకలేదు. ఈ హడావుడి నామసంవత్సరములో, పోలీసులకంటె, మా వాళ్ళకే నామీద ఎక్కువ కోపంగలిగింది. దెబ్బలు తింటాననీ, జైలుకు వెళతాననీ; రకరకాలుగా వూహించుకొని విచారించేవారు. "అవసరమైతే మాకైనా వ్యతిరేకంగా ఉండువుగాని కాని, గవర్నమెంటుకు మాత్రము వ్యతిరేకంగా ఏమీచేయవద్ద"న్నారు. ప్రభుత్వమంటే ప్రీతితోగాదు వారలా మాట్లాడింది. ఎదురు తిరగడమంటే బెదురుపుట్టడంవల్ల. కాని నేను మాత్రం వారిసలహా నంగీకరించలా. అందువల్ల ఆపుస్తకం అచ్చువేయ డానికి డబ్బుయిప్పం పొమ్మన్నారు. నేనూరుకోలా. ఆపుస్తకానికి తగిన వరుణ్ణి మాట్లాడి (అంటే బేరమాడి) అచ్చువేయించా. దానిభర్త ఆలో చనలేని ఆవేశపరుడు. పుస్తకంలో గూడా సరిగా యిదేవుంది. అందు వల్ల దాని పాత్రౌచితిని గురించి శంకించ నవసరములేదు.

క్రమేణా దేశంలో రాజకీయ నిర్బంధాలు ఎక్కువైనాయి. నామీద మావాళ్ళ వత్తిడీ ఎక్కువయింది. ఆ వత్తిడికి తట్టుకోలేక నా బుద్ధి మెత్త బడింది. సరే. నెమ్మదిగా ఏ ప్రమాదమూలేని సంఘంలోజేరి పనిచేద్దా

మనుకున్నా. నిర్మాణకార్యక్రమం ప్రారంభించా. పండితవిల్లూరు (పశ్చిమ గోదావరి) లో ఒక జాతీయకళాశాల స్థాపించి, హిందీ, చరఖా, సంస్కృతం, సంగీతం బోధించడానికి కొంతమంది వుపాధ్యాయుల్ని పెట్టి పని ప్రారంభించాను. మావాళ్ళ గుండెదడ తగ్గింది. గవర్నమెంటుకు వ్యతిరేకంగా ఏమీ చేయకుండా. తాము అభిమానించే మార్గాన నడుస్తున్నానని సంతోషించారు. అందువల్ల డబ్బుకూడా పుష్కలంగా పంపసాగారు. క్రమంగా కళాశాలకు వుత్సవాలు చేయడం, కళావారి దగ్గర్నించి రంగాగారివరకూ వచ్చి ఆశీర్వదించడం జరిగింది. అనేకమంది వ్యక్తిగత సత్యాగ్రహంలో జైళ్ళకు పోతున్నారు. ఎంత అదృష్టవంతులు వారంతా ? అనేకమంది, అనేక వుద్దేశ్యాలతో జైళ్ళకుపోతున్నారు. నేనుకూడా ఒకసారి పోయొద్దామనుకున్నా. ఎలా తెలిసిందో యీవార్త ? మా పెద్దలు మంచంబట్టారు. దాన్తో తొడిగిన చెప్పులే విడిచేశా. ఏమీ తోచని పరిస్థితులు ఏర్పడ్డాయి. ఒకసారి పెద్దలవత్తిడికి లొంగా. లొంగినవాణ్ణి గంగిగోవులా వెంటలాక్కుపోవడం నేర్చుకున్నారు వారు. తరువాత వేయి రూపాయల చేతిఖర్చుతో, కళాశాలను గ్రామకమిటీకి అప్పజెప్పి ఇంటికి (వెంట్రప్రగడ) వచ్చేశా—

పెద్దలవత్తిడికి లొంగి అతివాద రాజకీయాలు మానుకున్నా. మితవాదమార్గాలు విడిచిపెట్టా. ఇక చేయవలసిన దేమిటా ? అని ఆలోచించా. వ్యక్తిగతసత్యాగ్రహానికి ఒప్పుకోని పెద్దలు ఇంకా దేనికి వప్పుకుంటారు ? వాళ్ళకు నచ్చేదీ, నేను చేయగలిగిందీ—కవిత్వం మిగిలింది. ఇక పాకం పట్టడం ప్రారంభించా. కవిసామ్రాట్టులతో కొంత పరిచయ మేర్పడింది. తరువాత కావ్యం వ్రాయాలని బుద్ధిపుట్టింది. కావ్యం తేలిగ్గా అందరికీ అందుబాటులో వుండేటట్టు రాద్దామని ప్రారంభించి కొన్ని పద్యాలు రాశాను. కావ్యానికిది లక్షణంకాదని తోటికవులు పరిహసించారు. రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దాలతో నిర్దుష్టంగా వుండాలన్నారు సరే ప్రజల కర్థమయ్యేది కావాలంటే మరోటి రాయచ్చు. ఇదిమాత్రం పండితలోకానికే రాద్దామనుకున్నా. కావ్యాన్ని ముగించా. మావాళ్ళంతా చల్లపల్లి రాజాగారికి అంకితం యిమ్మన్నారు. ఇచ్చేశా. కమ్మదొర—కమ్మకవితో గౌరవింపబడినందుకు సంతోషించాడు ముందు. కావ్యంలో మా పెద్దవాళ్ళ కోర్కెలూ, నా భావాలూకూడా ప్రతిబింబిస్తూ, రాజాగారిని పొగిడిన

పద్యాలూ, అలాంటివారినే విమర్శించినపద్యాలూ, రెండురకాలవీవున్నాయి. గ్రహించాడు దొర. ఈ పద్యాలు యిరారాం నాకంకితం యివ్వడంలో మీ వుద్దేశ్యమేమిటని ప్రశ్నించాడు. వున్నయదార్థాన్ని మీరు తెలుసుకోవడమే నా వుద్దేశ్యమని జవాబిచ్చా రాజాగారికి కొంచెం కళ్లు ఎఱ్ఱబడ్డాయి. నాకొక్కంచం ప్రాధమ్యం చల్లబడింది. అంతటితో యిలాంటి కావ్యాలన్నా అంకితాలన్నా విరక్తి పుట్టింది.

అగష్టు సంఘటనలు జరిగిపోయాయి. దేశంలో ఏమూల జూచినా కరువు కాటకాలు తాండవిస్తున్నాయి. ప్రజల్లో స్వాతంత్ర్య కాంక్ష, వర్గ చైతన్యమూ వృద్ధిపొందాయి. సమాజంతోపాటు నేనుకూడా అభివృద్ధి కాసాగా. అంతకంటా బీదలమీద నాకున్న అభిమానమూ, సానుభూతీ, ఎక్కువైంది. గురజాడ మహాకవి బోధ " ఆకులందున అణగి మణగీ, కవితకోయిల పలుకవలెనోయీ— పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయ్" తలకెక్కింది. రచనలు సులువుగానూ. దాస్య విముక్తికి మార్గం చూపేవిగానూ వుండాలనుకున్నా. చదలవాడ పిచ్చయ్య గారి పరిచయంతో అభ్యుదయ రచయితలసంఘంలో చేరా. బెజవాడపట్టణ సంఘానికి సహాయకార్యదర్శిగా పనిచేయసాగాను.

విభిన్నదృక్పథాలు. అభిప్రాయాలూ గలిగిన కవులతోనూ? పండితులతోనూ చర్చించేటప్పుడు అనేక అనుమానాలు, సమస్యలూ బయలుదేరేవి. తుమ్మల వెంకట్రామయ్య మద్దుకూరి చంద్రశేఖరరావు మున్నగు వారితో చర్చించేవాడిని. వారు తేలికగా విశదపరచి చెప్పేవారు, కందుకూరి. గురజాడ, కొమరాజు. గిడుగు. విశ్వకవి ఠాగూరు, కేరళకవి వల్లథోల్, వరోజినీ. టాల్‌స్టాయ్. గోర్కీ మున్నగువారి రచనల్నీ, మాటల్నీ ఉదాహరణగా చూపేవారు. నాకాశ్చర్యం వేసేది. మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలలో నేను చదువుకున్నప్పుడు. కమ్యూనిస్టులు రాజకీయాలలో మాత్రం పట్టలనుకునేవాణ్ణి. ఇప్పుడు సాహిత్యంలోకూడ మేటిలనే భావం కలిగింది। క్రమంగా సాహిత్యంతో పాటు, రాజకీయాలుకూడా చదవడం, చర్చించడం ప్రారంభించా. చర్చలు సాగేకొద్దీ కమ్యూనిస్టులంటే అభిమాన ఎక్కువైంది. చేరదామా అనుకున్నా. పార్టీశిక్షణా, రూల్సూ. చూస్తే భయంవేసింది.. అవి నాకెంతమాత్రం నచ్చలా. "దేశంలో యిన్ని రాజకీయపార్టీలున్నాయి. దేనిలోచేరినా సభ్యత్వరుసుం చెల్లిస్తే

చాలు. ఇతర బాధలేమీ వుండవు. అలాంటప్పుడు ఈ పార్టీలో—ఇలా పని చేయాలనీ—ఇలా వుండాలనీ—ఇలా వ్రాయాలనీ—నియమాలేమిటి ?" అను కున్నా. చివరకు పార్టీలో చేరకుండా దూరంగా వుండడానికే నిశ్చయించు కున్నా. పిమ్మట "ఏది అభ్యుదయరచన?" అని, అభ్యుదయరచనల సంపుటిలో ఒకవ్యాసం వ్రాశాను. అందరూబాగానే వుందన్నారు. తరువాత "అభ్యుదయరచన అనే పుస్తకం వకటి రాశాను. నా పుస్తకం సంఘం వారు చూస్తేగాని అచ్చు వేయడానికి వీల్లేదన్నారు. తప్పులుంటే దిద్ది అచ్చువేస్తామన్నారు, నాకు కష్టంకలిగింది, "కవిత్వానికి తప్పేమిటి? తప్పు కవిత్వమేగాదు. మీరు చూడనక్కర్లేదు. ఇష్టమైతే మీరువేయండి లేకపోతే నేనే అచ్చువేస్తాన"న్నాను. అభ్యుదయరచయితలసంఘంవారు నిజంగా రెంటికీ అంగీకరించలేదు. కాని అచ్చుమాత్రం వేశాను. అందులో తప్పులున్నమాటనిజమే. ఆసంగతి మొదట్లో తెలియలా. క్రమేణా తెలిసింది. ఇంతలోనే నాకు సన్మానం చేయాలనుకున్నారు రాజాగారు. ఇంకా తప్పులుజేసే స్థితిలోనే లేననీ, తప్పులు తెలుసుకోగలిగే స్థితిలో బడ్డాననీ, తెలియజేశాను. మావాళ్ళంతా కోప్పడ్డారు. కోపాలకు లొంగిన అనుభవాలన్నీ జ్ఞాపకానికొచ్చాయి. ఆపండయ్యా కోపాలన్నా.

రాష్ట్ర అభ్యుదయ రచయితల మహాసభను బెజవాడలో దిగ్వి జయంగా జరుపాలని, శక్తివంచనలేని కృషిచేశాను. అప్పటికి పనిచేయ డం అలవాటయింది. క్రమశిక్షణయొక్క అవుసరం తెలిసివచ్చింది. క్రమంగా రాజకీయాలు బాగా అర్థం చేసుకోగలిగిన స్థాయివచ్చింది. స్వాతంత్ర్యం సాధించి నేటి సమాజంలోని హెచ్చుతగ్గులను నిర్మూలించి అందరికీ తిండి, బట్ట, విజ్ఞానం సౌఖ్యం కలుగజేయడానికై కమ్యూనిస్టు పార్టీ పోరాడుతోందని గ్రహించా. ముఖ్యంగా సారస్వతాన్నీ, కళల్నీ వృద్ధిజేయడానికై చేసే పార్టీకృషి జూచి మురిసిపోయా. ఏమైనాసరే, ఇక వెంటనే పార్టీలో జేరాలనుకున్నా. కాని అది నాచేతుల్లోలేదు. నన్ను వెంటనే జేర్చుకోవడం, చేర్చుకోకపోవడం పార్టీచేతుల్లో వుంది. పార్టీకి నమ్మకం కలిగేటట్లు పనిచేయడం మాత్రమే నేను చేయగలిగింది. అందు చేత సక్రమంగా పనిచేయసాగాను. క్రమంగా నన్ను పార్టీలోకి తీసుకు న్నారు; ఇప్పటికి నాసంగతి నాకు బాగా అర్థమైంది. కాని యిప్పుడు మాపెద్దలు ఆప్తులు, నాకు దూరమయ్యారు. నాకుమాత్రంఆప్తులు, పెద్దలు, సర్వమూ పార్టీయే అయింది.....

## డాక్టరు లక్ష్మి, యం. బి. బి. యస్.

**విద్యార్థి హక్కులకై కమ్యూనిస్టులు చేసినకృషి నన్నాకర్షించింది**

సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా సాగుతూన్న రోజులలో (1920)బందరులో ఒక మధ్యతరగతి కాంగ్రెసు కుటుంబంలో పుట్టాను. మాతండ్రి హిందూ హైస్కూలులో ఉపాధ్యాయుడు. ఆర్థిక చిక్కులవలన ఉద్యమంలో పాల్గొనలేకపోయినా, జాతీయోద్యమమంటే, గాఢమైన అభిమానముండేది ఆయనకు. ఉన్నతమైన భావాలూ, సంఘసంస్కరణపట్ల అభిలాషా వుండేవి. బిడ్డలను విజ్ఞానవంతులుగా అభివృద్ధి చేయుడమూ - తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకొని, తమ్ముతాము పోషించుకోగల విధంగా బిడ్డలను తరిఫీదు చేయడమూ, తలిదండ్రుల బాధ్యత యని గ్రహించినవారు మా తండ్రి. అందుచేతనే మాది బ్రాహ్మణ కుటుంబమైనప్పటికీ, తరతరాలనుండీ ఆచారంగా వస్తున్న "అష్టవర్షాత్ భవేత్ కన్యా" అనే సనాతన ఛాందస సూత్రాన్ననుసరించి, ఏ ఎనిమిది, పదేండ్ల వయస్సులోనో పెండ్లిచేసి, వంటయింట్లో పడవేయకుండా - మా అక్కచెల్లెండ్రను చక్కగా చదివించసాగారు. కుటుంబమంతా జాతీయభావాలు గల కుటుంబంగా తయారుచేశారు. తరువాత 1930 - 32 ఉద్యమాల్లో మాలోని జాతీయత ప్రగాఢమయింది. అయినా చిన్నపిల్లల మగుటచే - పత్రికలు చదవడం మినహా - మరే రాజకీయ జీవితమూ 1937 సం॥ వరకూ - వుండేదికాదు.

1937 లో విశాఖపట్టణం మెడికల్ కాలేజీలో చేరాను. అప్పట్లో కాంగ్రెసు, మంత్రివర్గాలు స్వీకరించబోతోంది. విద్యార్థులందరూ తమ

యొక్క న్యాయమైన హక్కులు నెరవేరగలవని ఆశించారు. కాని ఆ ఆశలు అడియాసలయ్యాయి. ఆంధ్ర మెడికల్ కాలేజీ యం. బి. బి. యస్. డిగ్రీలను గుర్తించలేదు. కాలేజీ విద్యార్థులలో కాంగ్రెసు మంత్రివర్గంపై అసంతృప్తి కలిగింది. చివరకు 1938 సం॥ లో విద్యార్థులందరం కలిసి "రికగ్నిషన్" కొరకు పెద్ద సమ్మెచేసి విజయాన్ని సాధించాం. ఆ సందర్భంలో కమ్యూనిస్టు విద్యార్థులు జయప్రదంగా సమ్మెను నడిపారు. వారితో పాటు సమ్మె విజయవంతం గావడానికి కృషి చేయడమే గాకుండా విద్యార్థి ఫెడరేషనును నిర్మించడంలో కూడా తీవ్రంగా పనిజేశాను.

ఈ సమయంలోనే కమ్యూనిస్టు విద్యార్థులతో పరిచయంగలిగింది. పార్టీసాహిత్యం చదువసాగాను. చిరకాలంనుండీ వస్తుందనుకుంటున్న ప్రపంచమహాసంగ్రామం రానేవచ్చింది ఆ సమయంలో పార్టీపంథాయే స్వాతంత్ర్యసముపార్జనకు సరియైన మార్గమని గ్రహించాను. పార్టీలో చేరాలనే కోర్కెకలిగింది. కాని ఆరోజులలో పార్టీ సభ్యత్వందొరకడం అంతతేలికైన విషయంగాదు పార్టీ రహస్యపార్టీ అతిజాగ్రత్తగా పార్టీ యంత్రాన్ని నడుపవలసివుంది. ప్రభుత్వనిర్బంధ విధానం పెచ్చుపెరిగింది. అంచేత చైతన్యము, క్రమశిక్షణ, పట్టుదల, ఓర్పు విరామమెరుగని కార్యదీక్ష వుంటేనేగాని పార్టీలోకి తీసుకునేవారుకారు. పార్టీ సభ్యత్వంసంపాదించలేకపోయినా, విద్యార్థిహక్కులకోసం మాత్రం గట్టిగా పనిచేసేవాడను. విద్యార్థినులనందరినీ సంఘటితపరచి, తమహక్కులకోసం పోరాడేలాజేయాలని పూనుకున్నాను. 1940 సం॥లో ప్రథమవిశాఖపట్టణ విద్యార్థినీ కాన్ఫరెన్సు జరిపాం. ఆ సభను జరిపిన తరువాత విద్యార్థినీ సంఘమును విద్యార్థిసంఘానికి అనుబంధశాఖగా నేర్పాటుజేశాం. ఆసంవత్సరమే విజయనగరంలో జరిగిన జిల్లావిద్యార్థి మహాసభతోపాటు, జిల్లా విద్యార్థినీ మహాసభనుకూడా ఏర్పాటుజేశాం. ఈవిధంగా విద్యార్థిహక్కులకై కృషిచేస్తూ, క్రమంగా పార్టీలో స్థానం సంపాదించగలిగాను.

ఎడతెగకుండా విద్యార్థుల్లో సామ్రాజ్యవాదవ్యతిరేకప్రచారం సాగించాను. రెండుసంవత్సరాలు స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో సమ్మెలు చేయించాం. 1941 సం లో స్వాతంత్ర్య దినోత్సవానికి ముందుగానే ప్రభుత్వం విద్యార్థినాయకులనందరినీ డిటెయిన్ చేసింది. అయినా, నిర్భయంగా ఊరేగింపు జరిపి, స్వాతంత్ర్యదినోత్సవం జయప్రదంగా

జరిపాం. ఆసమయంలో యూనివర్సిటీ స్నాతకోత్సవం జరిగింది. మద్రాసుగవర్నరు. సర్ ఆర్థర్ హోప్ హాజరయ్యారు. ఆయనగౌరవార్థం, టీ పార్టీ ఏర్పాటుచేశారు యూనివర్సిటీపెద్దలు. "సర్ ఆర్థర్ హోప్, నో హోప్, గో బాక్" అంటూ, విద్యార్థులమంతా కలసి వ్యతిరేకప్రదర్శనలు చేశాం. టీ పార్టీ ఉత్సాహమంతా చప్పబడిపోయింది పెదిమలు కొరుక్కున్నారు యూనివర్సిటీ పెద్దలు. సహించలేకపోయింది ప్రభుత్వం. 1941 సం॥ ఆగస్టులో ఇండియారక్షణచట్టంక్రింద, బందరు నుండి కదలకూడదంటూ, నన్ను "ఇన్ టర్న్" చేసింది. దీనినవకాశంగా తీసుకుని మెడికల్ కాలేజీ ప్రిన్సిపాలుగారు నవంబరునెలలో కాలేజీనుండి తొలగిస్తూ "ఎక్స్‌పల్షన్ ఆర్డర్" జారీచేశారు.

1942 లో పార్టీపైన నిషేధంపోయింది. పార్టీసభ్యులు బహిరంగంగా పని చేయగలుగుతున్నారు. నా పైనున్న "ఇన్ టర్న్మెంటు ఆర్డరు రద్దు చేయబడింది. తిరిగి మెడికల్ కాలేజీలో ప్రవేశించాను. నిర్భయంగా పార్టీప్రచారం చేస్తూవచ్చాను. ఆగస్టు ఘటనలలో పార్టీ తప్పుమార్గాన పోతోందని చాలమంది విద్యార్థులు భావించేవారు. పార్టీ పంథా ఒక్కటే దేశాన్ని రక్షించుకోవడానికి, జాతీయ ప్రభుత్వాన్ని గుంజుకోవడానికీ, ఏకైక మార్గమని రుజువుచేయడానికి తీవ్రంగా కృషి చేయవలసి వచ్చింది. అందువల్ల ఎక్కువకాలాన్ని రాజకీయాలకై వుపయోగించినప్పటికీ, ఫైనల్ యం.బి. లో బాగా మార్కులు తెచ్చుకుని రెండుపతకాలు (Distinction medals) సంపాదించగలిగాను.

దేశంలో తగినంతమంది డాక్టర్లు లేరు సామాన్యప్రజలకు వైద్య సహాయం బొత్తుగా లభించడంలేదు. కాబట్టి పార్టీసభ్యులైన డాక్టర్లు, వేరే పార్టీపని చేయడంకాకుండా, విడిగా వైద్యం చేయాలని పార్టీ నిర్ణయం. అందుచేత విజయనగరంలో ప్రాక్టీసు పెట్టాను. మొదటిరోజుల్లో ఎంతో జాగ్రత్తగా వుండేతప్ప ప్రాక్టీసు నిర్వహించడం కష్టం. కాని ఇంతలో ఉత్తరవిశాఖలో కరువు వచ్చింది. కరువు బాధితులైన ప్రజలు అనేక రోగాలకు గురయ్యారు. కమ్యూనిస్టు పార్టీ చొరవతీసుకుని వివిధపక్షాల ప్రతినిధులతో కూడిన ఐక్యప్రజారక్షణ కమిటీని ఏర్పాటుచేసింది. కమిటీలో నేనుకూడా ఒక సభ్యురాలను. ఆ కమిటీతరపున కొంతమంది విద్యార్థులనూ, పైడిరాజు అనే చిత్రకారునీ వెంటబెట్టుకుని ఉత్తర విశాఖలో

సంచారం చేశాను. కరువుకాటకాలవల్ల మరణించే ప్రజలయొక్క నిస్సహాయతను గూర్చి ఒక రిపోర్టుతయారుచేశాను. ఈరిపోర్టును ఆధారంగా తీసుకుని ఇండియన్ మెడికల్ అసోసియేషన్ యొక్క ఆంధ్రశాఖవారు, కరువు నివారణకూ, వైద్యచికిత్సకూ పూనుకున్నారు. ఆస్పత్రులు పెట్టారు. వైద్యచికిత్సకూ, కరువు నివారణకు కృషిచేయడంద్వారాను. చందాలు వసూలుజేయుటద్వారాను, విజయనగరంలోని మధ్యతరగతి మహిళలతో సంబంధ మేర్పడింది. మహిళామండలి క్లబ్బులో సభ్యురాలిగా చేరాను. క్లబ్బు కార్యదర్శినిగావుంటూ, మహిళలకు చేయగలిగిన సేవచేస్తున్నాను. నేనీవిధంగా కృషి చేయగలుగుటకు నా తండ్రీ, భర్తా, ఎక్కువగా నా పార్టీ—కమ్యూనిస్టు పార్టీ—యిచ్చిన ప్రోత్సాహమూ, కలిగించిన చైతన్యమూ కారణాలు. నా భర్త ప్రస్తుతం విశాఖ జిల్లా పార్టీ కమిటీసభ్యులుగా పని చేస్తున్నారు.

## తుపాకుల సింహాచలం

> దిక్కూ మొక్కూలేని మాలాంటి దరిద్ర
> జీవులకు కమ్యూనిస్టుపార్టీయే దిక్కు

సాధారణంగా మా 'రెల్లి' కులంలో హెచ్చుమంది త్రాగుడు, జూదం మొదలైన దురలవాట్లకు గురై వుంటారు. పగలంతా పాకీదొడ్లు, రోడ్లు బాగుచేయడం. సాయంత్రం తాగి తందనాలాడడం మాకు నిత్యకృత్యాలు. ఏ మాటికో, కోటికో వకరుతప్ప చదువుకున్న వారంటూ కనుపించనే కనుపించరు. విద్యలేదు. విజ్ఞానం శూన్యం. లెక్కలేని మూఢనమ్మకాలూ-పిచ్చిపిచ్చి ఆచారాలూ మాలో కరుడుగట్టి పోయినయి.—

ఇక సమాజం దృష్టిలో మేము కుక్కలకంటే హీనం. ఆరోగ్యానికి అవుసరమైన పనులన్నీ మాచేత చేయించుకుంటుంది సమాజం. కాని మేము కంటబడితేనే ఏవగించుకుని తొలగిపోతుంది. పట్టణాలకు దూరంగా మురికి కూపాలలో పడివుండమని శాసిస్తుంది. సమాజ మీవిధముగా వెలికి త్రోయడంవల్లనే మేము మరింత పతనమైపోతున్నాం.

సమాజంతో సంబంధంలేని మాకు మంచిచెడ్డల తారతమ్య మేమి తెలుస్తుంది ? మాకు కష్టాలెక్కువ. రాబడి తక్కువ. కాస్సేపయినా కష్టాలు మరచిపోయి, కులాసాగా వుండాలనుకుంటాం. చేతికొచ్చిన నాలుగు డబ్బులూ పెట్టి తాగేస్తాం. ఫలితం ?—ఇల్లిల్లపాదీ పస్తులు పడుం టటం.—

ఇలాంటి 'రెల్లి' కులంలోపుట్టిన నాకు యుక్తవయస్సు రాకముందే తండ్రి మరణించాడు. కుటుంబం పెద్దకుటుంబం. పోషించే బాధ్యత

నామీద పడింది. కష్టపడి తెచ్చే నాలుగురాళ్లూ తిండికే సరిపోయేవికావు. అందువల్ల త్రాగుడుకలవాటు పడకుండా, జాగ్రత్తగా సంసారాన్నీదుతూ వచ్చాను. అదృష్టవశాత్తూ, త్రాగుడు కలవాటు పడనిపోవడంవల్ల జూదం మొదలగు దుర్వ్యసనాలకు కూడా దూరంగా వుండగలిగాను.

యుక్తవయస్సు రావడంతో కొంచెం మంచిచెడ్డలను తెలుసుకునే జ్ఞానం కలిగింది. నాతోటియువకులూ, మాపెద్దలూకూడా తాగి తందనాలాడడం స్త్రీలను బట్టుకొని చావబాదడం, చూస్తుంటే అసహ్యంకలిగేది. సమాజంలో పశువుల్లాగా పరిగణింపబడే మాకులాన్ని చూచి కుమిలి పోయేవాణ్ణి. ఈపనులు మీకు తగవు. ఇల్లా నడచుకోండని చెప్పే పుణ్యాత్ము డెవరూ కనుపించేవారుకాదు. అందుచేత మన కుల లోని దురలవాట్లను మనమే మాన్పుకోవాలనుకున్నాను. అమిత కష్టంమీద మా అన్నదమ్ములను, దురలవాట్లకు గురికాకుండా చేయగలిగాను.—

క్రమేణా నాకృషి ఫలించసాగింది. నాకు సంబంధించిన మూడు కుటుంబాలూ దురలవాట్లకు దూరంగా వుండగలిగాయి. మంచం వున్న వరకూ కాళ్లుచాపుకుంటూ, ఒడుదుడుకులు లేని జీతాన్ని గడుపుకుంటున్నాము. ఇదిచూచిన పిన్నలూ, పెద్దలూ మెచ్చుకోసాగారు. క్రమంగా మా కులంలో "సముద్రమంతా సారాయయితే, కాలువలన్నీ కల్లేయయితే కరువొస్తే మాకేమి?, కాటకాలొస్తే మాకేమి?" అనే లిల్లాయి పదాలు పోయి "త్రాగడం తప్పు" అనే భావం వ్యాప్తం ఏర్పడింది:—

స్వల్ప జీతాలతోను, అమిత కష్టాలతోను, దురలవాట్లతోను నాశనమైపోయే మా కుటుంబాల పరిస్థితి యుద్ధం రావడంతోనే మరీ హీనమైపోయింది. యుద్ధకాలంలో మా బెజవాడ పట్టణ జనాభా 96 వేలనుండి లక్ష యేభై వేలకు పెరిగింది. పాకీ దొడ్లెక్కువయ్యాయి. రోడ్లుకూడా పాకీ దొడ్లుగా పరిణమించాయి. అదనపు వర్కర్లను నియమించకుండా వున్న వర్కర్లే పనిచేయాలంది మున్సిపాలిటి. 40 దొడ్లను బాగుచేసే వర్కరిప్పుడు 70 దొడ్లను బాగుచేయవలసి వచ్చింది. తెల్లవారుజాము మొదలు కొని ప్రొద్దస్తమానం చేస్తేనేగాని పని పూర్తిగాదు. ఇంతచేసినా ఇచ్చే వేతనం మామూలే. తిండిగింజలధర, కట్టుగుడ్డలధర వింతగా పెరిగాయి. ఇలాంటి పరిస్థితుల్లో మా పొట్టగడిచేదెలా? పేం పనిచేసేదెలా? వేళకు సరిగా రాలేదనీ; దొడ్లు సరిగా బాగుచేయలేదనీ, నేరాలు మోపే

వారేగాని, మా ఆలనా, మాపాలనా పట్టించుకొనే దాతలేరి ? ఇక మ్యునిసిపాలిటీ అధికార్లతో చెప్పుకుంటే బూతులూ, బుకాయింపులూ తప్ప ఫలిత మేముంది ? ఈవిధంగా కష్టాలతో కొట్టుకులాడుతూన్న మాకు కమ్యూనిష్టు పార్టీ అండగా నిలిచింది; మ్యునిసిపల్ వర్కర్ల యూనియన్‌ను ఏర్పాటు చేసి, మా కష్టాలను పోగొట్టడానికి పోరాడసాగింది. త్రాగుడు మున్నగు దురలవాట్లను విడిచిపెట్టండనీ, అందరూ యూనియన్‌లో చేరి హక్కుల కొరకై పోరాడండని మాలో తీవ్రంగా ప్రచారంచేసింది. ఈ ప్రచారం నన్నెంతో ఆకర్షించడంవల్ల మ్యునిసిపల్ వర్కర్ల యూనియన్‌లో చేరి పనిచేయసాగాను. క్రమంగా మా యూనియన్‌ను బలపర్చుకో గలిగాం. యూనియన్ తరపున అనేక పోరాటాలు నడిపాం. అధికారు లెన్ని ఆటంకాలు కలిగించినా, వాటి నన్నిటినీ సంఘబలంతో జయించాం. అధికధరల అలవెన్సునూ, ఇతర సౌకర్యాలనూ సంపాదించగలిగాం.

జీవితంలో మొదటిసారిగా సంఘబలంద్వారా హక్కులను సాధించుకోగలిగిన మా మ్యునిసిపల్ వర్కర్లు, యూనియన్‌ను తమ ప్రాణంతో సమానంగా భావించుకోసాగారు. మా కులాల్ని బాగుచేసి, మమ్మల్నికూడా మానవులుగా అభివృద్ధిచేయడానికి, మాకష్టాలను పోగొట్టుకోవడానికి తోడ్పడుతూన్న కమ్యూనిస్టుపార్టీపై నాకభిమానం హెచ్చింది. పార్టీ సభ్యులతో కలసి పనిచేస్తూ పార్టీ అంటే ఏమిటో తెలుసుకో గలిగాను. మ్యునిసిపల్ వర్కర్ల అభివృద్ధికోసం, నా తీరిక సమయాన్నంతా వినియోగించి కృషిచేస్తూ క్రమంగా 1941 సం॥లో పార్టీలో స్థానం సంపాదించ గలిగాను.

కిటకిటలాడే జనాభావల్ల 1943 సం॥లో పట్టణ ప్రజల ఆరోగ్యం పాడైపోయింది అంటురోగాలూ, జాడ్యాలూ ఎక్కువయ్యాయి. ఆరోగ్య శాఖవారి ప్రయత్నాలు ఫలించలా. ప్రజల ఆరోగ్యాన్ని కాపాడవలసిన బాధ్యత మ్యునిసిపల్ వర్కర్లదేనని పిలుపిచ్చింది కమ్యూనిస్టుపార్టీ. వెంటనే మా యూనియన్ తరపున వర్కర్లమంతా బయలుదేరాం. పట్టణ మంతా ఊడ్చి బాగుచేయడానికి తగిన పరికరాలు లేవు. చెత్తా, చెదారం తోలడానికి చాలినన్ని బండ్లు లేవు. అయినప్పటికీ వున్న పరికరాలతోనే పని ప్రారంభించాం. ఆరోగ్యవారాన్ని జరిపాం. ప్రతిరోజూ మేం చేయవలసిన పనిని పూర్తిచేసుకుంటూనే, రాత్రింబవళ్ళు కష్టపడి పట్టణమంతా

ఎలాంటి గలీజులేకుండా బాగుచేశాం. ఈ కృషిలో మాకు అనేకమంది పార్టీ సభ్యులూ, యితర యువకులూ తోడ్పడ్డారు. పార్టీ డాక్టర్లు పట్టణమంతా తిరిగి 'ఇంజక్షన్లు' యివ్వడంలో హెల్తు డిపార్టుమెంటుకు తోడ్పడ్డారు. అంతటితో రోగాలాగిపోయినయి పట్టణప్రజలకు మా మీదసానుభూతి కలిగింది. వర్కర్లు సంఘం పెట్టుకున్నందువల్ల ప్రజలకు లాభమేగాని, నష్టంలేదని గ్రహించారు. పార్టీ కలిగించిన చైతన్యంవల్ల, ప్రజల ఆరోగ్యాన్ని కాపాడవలసిన బాధ్యతను గుర్తించిన మా మ్యునిసిపల్‌వర్కర్లు, అప్పటినుండీ నాగాలు పెట్టకుండా కష్టపడి పనిజేయసాగారు.

1944 సం॥ మార్చిలో అఖిలభారత రైతుమహాసభ బెజవాడ పట్టణంలో జరుపుటకు ఏర్పాటుచేయబడింది. పట్టణంలో కలరావుందనీ, లక్షమందిప్రజలు సభకు రావడంవల్ల ప్రమాదమైన పరిస్థితులు కలుగ వచ్చుననీ, పరిస్థితుల నెదుర్కోవడానికి తగినంత సింబ్బంది హెల్తు డిపార్టుమెంటుకులేదనీ, సాకులుజెప్పి, సభను ఆపుజేయాలని ప్రయత్నించింది ప్రభుత్వం. దీనికికొంతమంది రైతుఉద్యమ విచ్ఛిన్నకులుకూడా తోడయ్యారు. వెంటనే మేంముందుకు వచ్చాం. లక్షమంది ప్రజలుసభకు వచ్చినప్పటికీ, పట్టణపారిశుద్ధ్యాన్ని కాపాడేబాధ్యతను తీసుకున్నాం. పార్టీ డాక్టర్లు పట్టణంలోని కలరాను ఆపుచేయగలిగారు, సభజరుపుకోడానికి ప్రభుత్వం అనుమతించక తప్పిందికాదు. సభజరిగినన్నాళ్ళూ పట్టణంలోనూ సభాస్థలంవద్దనూ వంతులప్రకారం, అహోరాత్రస్యా పనిజేసి, చిన్నమెత్తు లోటుకూడా రాకుండా జేయగలిగాం. ప్రజలూ ప్రభుత్వమూ కూడా ముక్కుమీద వేలువేసుకున్నారు.

ఈవిధంగా ప్రజలఆరోగ్యాన్ని కాపాడవలసినబాధ్యతల్ని గుర్తించి పనిజేయడం, హక్కులను రాబట్టుకోవడానికై కలసిపోరాడడం మాత్రమే కాదు కమ్యూనిస్టుపార్టీ మాకునేర్పింది. మాకులంలోవున్న దురాచారాలను రూపుమాపుకోవలసిన అవుసరంకూడా చూపెట్టింది. సాధారణంగా మాకులములో పెళ్ళిళ్ళకూ, దినాలకూ వచ్చిన పెద్దలందరికీ త్రాగుడుపోయించడం, పందులనుకోయడం మామూలు ఆచారం. నేనలాంటివేవీచేయకుండా పలు గురుపెద్దల్ని దగ్గరబెట్టుకుని పెళ్ళిచేసుకున్నాను. కొద్దిమంది కులపెద్దల మాటెలావున్నా, మాకులంవాళ్ళంతా సంతోషించారు. మాకుటుంబాలీనాడు పార్టీయంటే ప్రాణాలు విడుస్తాయి. నా సోదరుడుకూడా పార్టీలోచేరాడు.

ఈ మధ్య వచ్చిన 'తుపాను' పట్టణాన్నంతా చిందరవందర చేసింది. మా గుడిసెలన్నీ కూలిపోయాయి. కూలిపోయిన గుడిసెలను నిలబెట్టుకోవడానికి సాయంచేయమని ఎంత వేడుకున్నా మ్యునిసిపల్ కమీషనరు పట్టించుకోలా. మావర్కర్లంతా పని మానివేద్దామనుకున్నారు. "పని మానివేయవద్దు. రోడ్లూ, దొడ్లూ నరకకూపంలా తయారయినయి. వెంటనే బాగుచేయడం మన విధి. మన కష్టాలను పోగొట్టడానికి తోడ్ప డడం ప్రజలవిధి. మన విధిని గుర్తించి మనం పనిజేస్తే, ప్రజల విధిని గుర్తించి ప్రజలూ తోడ్పడతార"ని ప్రచారం జేశాను. వెంటనే మ్యునిసి పల్ వర్కర్లమంతా, వున్నపనిముట్లమతీసుకునిబయలుదేరాం. పనిముట్లు చాలలా. తట్టలూ, చీపుర్లూ, పారలూ తెచ్చి యిచ్చారు పార్టీసభ్యులు. అందరం కలిసి వారంరోజులు తీవ్రంగా కృషిచేసి పట్టణాన్ని మామూలు పరిస్థితులకు దెచ్చాం.—

ఇక మా గుడిసెల మాటేమిటి ? కమీషనరు కదలకుండా కూర్చు న్నారు. ప్రజలసాయంతో మా హక్కులకోసం పోరాడడం తప్ప వేరే మార్గం లేదనుకున్నాం. గుడిసెలు వేసుకోవడానికి సాయం చేయాలని, నీటివసతులు, వైద్యసౌకర్యాలూ కల్గించాలని, ఒక్కొక్క వర్కరూ 40 దొడ్లు మాత్రమే బాగుచేసేపని యివ్వాలనీ, తిట్టడం, కొట్టడం, నాగాలు వేయడం, జీతాలు విరగగోయడం, పనిలోనుండి తీసివేయడం మానాలనీ. మొదలైన కోర్కెలను అధికార్లకు తెలియబరచి ఆందోళన సాగించాం. మ్యునిసిపల్ అధికార్లూ, పోలీసులూ మా హక్కులను భగ్నం చేయాలని ఎన్నో ఎత్తులు వేశారు. కాని పట్టణప్రజలు మాకు గట్టిగా నిలబడి సాయంచేయడంవల్ల మా కోర్కెలు చాలావరకు నెర వేరినయి.

ఈ విధంగా ప్రజల ఆరోగ్యాన్ని కాపాడవలసిన బాధ్యతనూ, ప్రజల సాయంతో హక్కులను సాధించుకోగలిగిన మార్గాన్నీ చూపిం చిందీ—దురలవాట్లనూ, పిచ్చి ఆచారాలను మాన్పించి మమ్మల్నికూడా మానవులుగా అభివృద్ధి చేస్తోందీ—ఎవరు ? నిరుపేదల పార్టీ—కమ్యూ నిస్టుపార్టీ. అందుచేతనే మావలె సమాజంలో వెనుకబడి అణగారి పోయిన కష్టజీవులంతా, కమ్యూనిస్టుపార్టీ అండతో అభివృద్ధి చెందాలని మా కోరిక.

# గుమ్మిడి దేవదాసు

> రైతు - కూలీ ప్రజారాజ్యాన్ని నిర్మించాలని
> కమ్యూనిస్టులు చేసేకృషి నన్నాకర్షించింది

మూరెడు గుడ్డపీలికను గోచీగా పెట్టుకుని, 16 ఏండ్లు వచ్చేదాకా గొడ్లను కాచాను. మా తండ్రి నేతపనివాడు. నేతపనిలో నాలుగు డబ్బులు సంపాదిస్తే, ఆ నాలుగు డబ్బులతోనూ మా కుటుంబం గడిచేది కాదు. అందుచేత కుటుంబంలోనివాళ్లమంతా కూలిపనిని చేసేవాళ్లం. 16 ఏండ్లవరకు గొడ్లను గాసినా నేను సంపాదించగలిగింది మాత్రం సున్న. ఏదో దొరికినమాత్రం తింటూ, గొడ్లగాయడం తప్ప ఆ రోజుల్లో నాకింకేమీ తెలియదు. సమాజంలో యిన్ని హెచ్చు తగ్గులూ, మతాలూ, కులాలూ, స్వార్థాలూ వున్నాయనికూడా తెలియదు. ఏదో మా వాళ్లంతా పై కులాలవారికి ఎడంగా వుంటున్నారు; నేనూ అంతే —

క్రమంగా క్రైస్తవబడిలో చేరి 3 వ తరగతిదాకా చదువుకున్నాను. అప్పటికి సమాజంలోని హెచ్చుతగ్గులు, స్వార్థాలు అనుభవంలోకొచ్చాయి. నా స్థితినిగూర్చి, మా వ్యవసాయకూలీ పరిస్థితులనుగూర్చి నాలో మథన బయలుదేరింది. అంటరానివాళ్లంటూ దూరంగానెట్టాయి మమల్నగ్రవర్ణాలు. అంటుకోవడానికి అభ్యంతరమేగాని, కావలసిన పనులన్నీ చేయించుకోవడానికే అభ్యంతరమూ లేదు పాపం. రైతులతో కలసి పుట్లకొలది ధాన్యం పండిస్తాం. కాని పొట్టనిండా కూడులేక మాడిపోతూవుంటాం. ఇలాంటి హీనస్థితి మా వ్యవసాయకూలీల కెందుకొచ్చింది? దీనికి కారణాలేమిటి? ఈ ఆలోచన ఎక్కువయ్యేకొద్దీ సమాజంనుండి మమ్మును దూరంగా నెట్టినది హిందూమతమేననీ, ఆ మతంలో వుండగూడదనీ భావించాను. కులాలు, వర్ణాలు లేకుండా క్రిష్టయన్లంతా కలసి మెలసి తిరుగుతున్నారు గాబట్టి, ఆ మతం మంచిదనుకొని క్రిష్టియానిటీలో చేరాను.

ఏ అసామీవద్దనైనా కమతంచేసి పొట్టపోసుకుందామంటే, కొట్లూ, తిట్లూ పడడానికి మనసొప్పలా. అందుచేత కష్టంచేస్తూ స్వేచ్ఛగాజీవించ డానికి మార్గ మేదాయని ఆలోచించాను. చివరకు మక్తాకు పొలాలు తీసు కుని సేద్యం చేస్తూ కాలం గడుపసాగాను, ఈ కాలంలోనే నాతోటి కూలీ లకు చేతనైనసాయం చేయాలనే బుద్ధిపుట్టి రక్షణసైన్యంలోచేరి కాషాయ గుడ్డలు కట్టాను.

నేను రక్షణసైన్యంలో చేరినప్పుడు 1930 సం॥ ఉప్పు సత్యా గ్రహం జోరుగా సాగుతోంది. అనేకమంది రైతుబిడ్డలు, మేధావంతులు జైళ్ళకు పోసాగారు పల్లెటూరి రైతుల్లోకూడా స్వాతంత్ర్యం కావాలనే కోర్కె కలిగింది. "మా కొద్దీతెల్లదొరతనము" అనేపాట తరుచు విని పించేది. స్వాతంత్ర్యమొస్తేనే వ్యవసాయకూలీల కడగండ్లు తీరుతాయని నాకప్పుడు తెలియదు. తెల్లవాళ్ల ప్రభుత్వం పోయి, అగ్రవర్ణాల అధికార మొస్తే, మమ్మల్నింకా అణగద్రొక్కి, కుక్కలకంటే హీనంగా చూస్తా రని భావించేవాణ్ణి. అందుచేత కాంగ్రెసును అభిమానించడానికి బదులు వ్యతిరేకిస్తూ, "మాకొద్దీ నల్లదొరతనము" అంటూ పాడేవాణ్ణి.—

క్రైస్తవ మతంద్వారా. రక్షణ సైన్యంద్వార్గా, వ్యవసాయ కూలీల కష్టాలు పోగొట్టగలమని నాకప్పుడు నమ్మకముండేది, అందుచేత బంధు వుల వద్దా, స్నేహితులవద్దా రు 200/-లు వసూలుచేసి గుడి కట్టించాను, చిన్నదిగా వున్న మారక్షణ సైన్యశాఖను బలపర్చడానికి తీవ్రంగా కృషి చేశాను. పట్టినపట్టు విడువకుండా పనిచేసి, రక్షణసైన్య శాఖను బలపర్చి దాని జమేదారయ్యాను.—

ఈ విధంగా నాలుగైదు సంవత్సరాలు గడచినపిమ్మట మాపల్లెలో జొన్నలగడ్డ రామలింగయ్య, చింతల సూర్యనారాయణ, కాబోతు రామ స్వామిగార్లు వ్యవసాయ కూలీ సంఘం పెట్టారు. తరుచు మాపల్లెకువచ్చి వారేదో చెబుతూండేవారు. ఒకరోజు చింతల సూర్యనారాయణగారు కూలీలకేదో బోధిస్తూంటే నేను వెళ్ళి చెప్పేదేమిటో సరిగా వినకుండానే ఆయనమీద తిరుగబడ్డాను. వ్యవసాయ కూలీల కష్టఫలితం రైతులు కాజేస్తున్నారనే భావం వుండేది నాకప్పుడు. అందుచేత "పో మాకేమీ వద్దులే. పోయి వూళ్లోరైతులకు చెప్పుకో" అని మీదబడి కొట్టబోయాను. అంతలో వాళ్ళూ వీళ్ళూ అడ్డంవచ్చి నర్ది పంపారు.—

ఇంత రగడ జరిగినా నన్ను వదలిపెట్టకుండా కాబోతు రామస్వామిగారు నాతో సంబంధం పెట్టుకుని వివిధ విషయాలపై చర్చించడం పుస్తకాలియ్యడం మొదలుపెట్టారు. వాటితో నేను కొంత ఆలోచనలో పడ్డాను. కూలీలంతా వ్యవసాయ కూలీసంఘాలలో చేరి, సంఘ బలంతో హక్కులను సాధించుకోవాలనీ, రైతులూ, కూలీలూ ఒకరినొకరు అర్థం చేసుకొంటూ, కలసిమెలసి పోరాడి స్వాతంత్ర్యం సంపాదిస్తేనే, కష్టాల నుండి గట్టెక్కగలరనీ, రామస్వామిగారు నాకు నచ్చచెప్ప గలిగారు. క్రమేణా వ్యవసాయకూలీ సంఘాలంటే అభిమాన మేర్పడింది.

తరువాత పల్లెకోనలో జరిగిన వ్యవసాయకూలీ సభకు నన్ను బలవంతంగా తీసుకెళ్ళారు సూర్యనారాయణగారు. నేను మాత్రం వెనుకా ముందూ చూసుకుంటూనే సభకు వెళ్ళాను. వ్యవసాయకూలీల అభివృద్ధికై ఉపన్యాసాలిస్తున్న అగ్రవర్ణాలవ్యక్తులు మాతో కలసిమెలసి వుంటారా? అనేసందేహం నాలో వుండేది. కాని ఆసభలో అంతా అన్నదమ్ముల్లాగా కలసిమెలసి భోజనం చేయడం, చర్చించడం, చూసేసరికి నా కాశ్చర్యం వేసింది. నాకున్న అనుమానాలు, ద్వేషం పక్కాసారిగా పటాపంచలయ్యాయి. అంతటితో నాయకులిచ్చే ఉపన్యాసాలు, సభలో వివిధవిషయాలపై జరిగిన చర్చలు, చేసినతీర్మానాలు, ఎంతో శ్రద్ధతో పరిశీలించాను. కూలీలకు ప్రత్యక్షశత్రువులు రైతులుగాదనీ, కూలీలను రైతులనూకూడా దోచుకుతింటున్నవారు సామ్రాజ్యవాదులు, పెట్టుబడిదారులు, జమీందారులు, పీఠాధిపతులు మున్నగువారున్నారనీ; రైతులూ కూలీలు భుజం భుజం కలిపి పోరాడి స్వతంత్రభారత ప్రజాస్వామికాన్ని నిర్మించుకుంటేనే అంటరానితనంతో, ఆర్థిక దుస్థితితో కుమిలిపోయేపాటకజనం బాగుపడగలరనీ ఆసభలో తెలుసుకున్నాను. వెంటనే వ్యవసాయకూలీసంఘంలో చేరి కూలీలహక్కులకై కృషిజేయసాగాను. అప్పుడుతెలిసింది. చింతల సూర్యనారాయణ, కాబోతు రామస్వామి, జొన్నలగడ్డ రామలింగయ్య మున్నగువారు కమ్యూనిస్టులని.

చాలామంది కమ్యూనిస్టులు రైతుసంఘాలనుపెట్టి బలమైన రైతు ఉద్యమాన్ని నిర్మిస్తున్నారు. రైతులహక్కులకై పోరాడుతూ—రైతులు కూలీలకు జేసే అన్యాయాలను—రైతులకు నచ్చచెప్పడంద్వారా తొలగించ గలుగుతున్నారు. పిచ్చకుంటాల కొత్తలు, నాముపద్ధతులు, తక్కువ

కూలీకి పనిచేయించుకోవడం మున్నగునవి జరుగకుండా చేయగలుగు తున్నారు. మరికొంతమంది కమ్యూనిస్టులు వ్యవసాయకూలీసంఘాలలో పనిచేస్తూ, కూలీల న్యాయమైనహక్కులకోసం పోరాడుతూ, శ్రద్ధతో పనిపాటలు సరిగా చేసేలాచేస్తున్నారు. ఈ విధంగా ఉభయవర్గాలను సంఘటితపర్చి, ఐక్యమై పోరాడి, స్వాతంత్ర్యం సాధించి, రైతు - కూలీ ప్రజారాజ్యాన్ని నిర్మించాలని, కమ్యూనిస్టులు జేసే కృషినన్నాకర్షించింది. అప్పటినుండీ వ్యవసాయకూలీ సంఘంలో తీవ్రంగా కృషిజేస్తూ, క్రమంగా 1940 సం॥లో కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం సంపాదించగలిగాను.

ఆరోజుల్లో కమ్యూనిస్టుపార్టీ, రహస్యపార్టీ. ఎన్నోకష్టాల నెదు ర్కొంటూ పార్టీ సభ్యులంతా తీవ్రంగా కృషి చేసేవారు. నాకు కూడా తీవ్రంగా పనిచేయాలనీ, పార్టీసాహిత్యం బాగాచదవాలనీ కోర్కెకలిగింది. తొందర తొందరగా పనిపాటలను ముగించుకొని, పార్టీపని చెయ్యడం, సాహిత్యం చదువడం, చేస్తూవుండేవాణ్ణి.—

1941 సం॥లో జిల్లా వ్యవసాయకూలీ మహాసభ దావులూరులో జరిగింది. ఇంటిపనులన్నీ విడిచిపెట్టి, చుట్టుప్రక్కల పల్లెలన్నీ ప్రచారం జేసి, సభను జయప్రదంగా జరపడానికై తోడ్పడ్డాను. తరువాత వ్యవసాయ కూలీ ఉద్యమం బాగా వృద్ధిపొందింది. తాలూకా అంతటా కూలీ సంఘా లను నిర్మించడానికి ఆర్గనైజరుగా నియమింపబడ్డాను. ఇలా పనిజేస్తుండ గానే 1943 లో కామ్రేడ్ సుందరయ్య పార్టీనిధికై విజ్ఞప్తి చేశారు. పార్టీ పేదలపార్టీ. మన పార్టీని మనం పోషించుకోలేకపోతే యింకెవరు పోషి స్తారు ? అంచేత నాకున్న అరఎకరం పొలాన్నీ అమ్మి పార్టీకి ఇవ్వాలని నిశ్చయం చేసుకున్నాను. కాని "ఏడెనిమిది మందిగల కుటుంబం నీది. ఈ కుంటపొలం అమ్మి పార్టీకిస్తే నీ కుటుంబం గతి ఏమవుతుంది ? అం చేత నీ విచ్చినా పుచ్చుకోనంది" పార్టీ కమిటీ. చివరకు బలవంతంమీద ప్రజాశక్తి నిధికి నూరు రూపాయలిచ్చి సంతృప్తి పడ్డాను,

ఈనాడు వ్యవసాయకూలీ ఉద్యమం ఎన్నోరెట్లు బలపడింది. వ్యవ సాయ కూలీలలో నూతన చైతన్యాన్ని కలిగిస్తోంది కమ్యూనిస్టు పార్టీ. నావంటివారు చాలామంది. కూలీ ఉద్యమంకోసం తమ సర్వస్వం అర్పించి కృషిజేస్తున్నారు. పార్టీ నాకు కలిగించిన చైతన్యంవల్ల నేనీనాడు తాలూకా వ్యవసాయకూలీసంఘ అధ్యక్షుడుగా పనిచేయ గలుగుతున్నాను. నా భార్యా పిల్లలంతా పార్టీ ననుసరిస్తున్నారు.—

## మాదిరెడ్డి సుబ్బరామయ్య, ఇంజన్ డ్రైవర్, ఎం. ఎస్. ఎం. రైల్వే

యోగాభ్యాసము-తీర్థయాత్రలవల్ల కనుపించని ఫలితం — కమ్యూనిజంలో కనుపించింది

నా చిన్నతనంలో మా తండ్రిగారికి పోలీసు హెడ్ కాన్‌స్టేబిల్ పని. అల్లరిచేయడం, వాళ్ళనూ వీళ్ళనూ తన్ని రావడం నా పని. బాగా ఆరోగ్యంగానూ, దృఢంగానూ వుండేవాణ్ణి నేను. అంచేత ప్రతివాళ్ళమీద కలియబడేవాణ్ణి. ఎవరిమాటా వినేవాణ్ణి కాదు. ఎవర్నీ లెక్కచేసేవాణ్ణి కాదు. హైస్కూలులో చదివినంతకాలమూ ఇలాగే సాగించా. ఒకనాడు హెడ్‌మాష్టరునే పట్టుకు కొట్టాను. కాని తన్నడంలోవున్న నేర్పరితనం, చదవడంలో లేదు. అంచేత స్కూలుఫైనల్ తప్పాను.

స్కూలుఫైనల్ తప్పిన తరువాత యం. యస్. యం. రైల్వేలో ఇంజన్ క్లీనరుగాచేరాను. కొద్దికాలంలోనే నన్ను కోల్‌మేస్త్రీగా ప్రమోట్ చేశారు. ఆ పనిలోవుండగా బొగ్గుకూలీల కష్టాలు కండ్లారా జూశాను. గుమాస్తా (writer), వాళ్ళ నెన్నో కష్టాలుపెట్టి, దోచుకుతినేవాడు. నా చేతనై నంతవరకూ, కూలీలకు తోడ్పడసాగాను. ఆరోజుకారోజు రైటరుపని శృతిమించి రాగాన బడింది. ఇక సహించలేక రైటరును పట్టుకొని మెత్తగా కొట్టాను. ఆ దెబ్బతో అక్కడినుంచి బదిలీ చేయించుకు పోయాడు రైటరు. కూలీలంతా సంతోషించారు.

రైటరునయితే కొట్టి తరిమాగాని, రైల్వే కంపెనీలోని లంచగొండి అధికార్ల నేమిచేయాలో తోచలా. మెస్మరిజాన్నభ్యాసంచేసి, దాని శక్తితో లంచగొండి అధికార్లను సాధించి సరిజేయాలనుకున్నాను. కొంతకాలం మెస్మరిజంతో కిందామీదాపడి చివరకు యోగాభ్యాసం మొదలెట్టాను. యోగాభ్యాసాన్నిగూర్చి ఎన్నో గ్రంథాలుచదివాను. ఈకాలంలో

ఒక విద్యార్థి నావద్దకు వచ్చి, నాతో కలసి తానుకూడా యోగాభ్యాసం ప్రారంభించాడు. ఈ తరుణంలోనే నేను 'ఫైర్ మన్' గా నియమింప బడ్డాను. డ్రైవర్లూ, ఫైర్ మన్లూ అనుభవించే కష్టాలనెన్నిటినో స్వయంగా అనుభవించాను. అప్పుడప్పుడు పట్టరాని ఉద్రేకం కలిగేది నాలో. కాని కష్టాలను తొలగించుకునే మార్గమేదీ కనుపించనందువల్ల ఏమీ చేయలేకపోయాను.

ఇంతలో నాకు బాగా జబ్బుచేసింది. అంతటితో యోగాభ్యాసం వదలిపెట్టాను. కాని ఊరికే కూర్చోకుండా వేదాంతగ్రంథాలు, మతగ్రంథాలు అనేకంగా సంపాదించి ఎక్కువశ్రద్ధతో చదివాను. ఆ మీదట బయలుదేరి దేశంలోవున్న పుణ్యక్షేత్రాలన్నీ దర్శించి వచ్చాను. ఎన్ని పుణ్యక్షేత్రాలు దర్శించినా. కష్టాలనుండిగట్టెక్కేమార్గమేమీ కనుపించలా. మానవుడు తరించేమార్గం పుణ్యక్షేత్రాలలో కన్పిస్తుందని చెప్పడమంతా దగాగా కనుపించింది. ఎక్కువ-తక్కువలూ; దోపిడీలు-కష్టాలూ: అన్ని చోట్లా వున్నయి. దానితో కండ్లుతెరిచాను. తిరిగి మళ్ళీ వేదాంతగ్రంధాలు చదివాను. చదివి చదివి చివరకు, వేదాంత సారమంతా 'సమానత్వ మను కున్నాను. అధికుడనీ, నీచుడనీ, ఎక్కువనీ—తక్కువనీ, లేదు. మానవు లంతా ఒకటేనని చెబుతున్నాయి వేదాంతగ్రంధాలు, మరి యీ వేదాంతు లిలా సంచరిస్తారేం? సమానత్వాన్ని సాధించేదెలా? ఏమో? ఏమీతోచలా.

క్రమంగా నేనొక ఇంజన్ డ్రైవరుగా నియమింపబడ్డాను. దేశ మంతారాజకీయాందోళనతోను, ఆర్థిక దుస్థితితోనూ తుకతుక లాడుతోంది, 1930—32 సంవత్సరాల సత్యాగ్రహ పోరాటాలు వచ్చాయి. కాంగ్రెసు అంటేనూ, పోరాటాలంటేనూ, అభిమానమేర్పడింది విడువకుండా దిన పత్రికలు చదువసాగా. కాంగ్రెసును అన్నివిధాలా బలపర్చుతూ, కాంగ్రెసు వ్యతిరేకులతో దెబ్బలాడేవాణ్ణి. ఈ సమయంలో ఆర్థిక దుస్థితితో పాటు మా కష్టాలుకూడా ఎక్కువయినయి. మా లోకోషెడ్ టర్నర్ విప రీతమైన లంచగొండి, లంచాలకోసం. ఫైర్ మన్లనూ, డ్రైవర్లనూ విప రీతంగా బాధించేవాడు. టర్నరు పెట్టే బాధల్ని సహించలేకపోయా, అతన్ని వంచేమార్గమేమీ కనుపించలా. అందుచేత ఒంటరిగావున్న సమ యం కనిపెట్టి టర్నరును పట్టుకుని చావగొట్టి చెవులుమూశా. ఆదెబ్బతో తంగారుపడి బదిలీ చేయించుకుపోయాడు టర్నరు. అంతటినుండే నన్ను

జూస్తే లంచగొండి ఉద్యోగులకు హడల్‌గా ఉండేది. తోటిడ్రైవర్లూ. ఫైర్‌మన్లూ ప్రేమించేవారు.—

ఈవిధంగా దెబ్బకు జడిసి దయ్యం పారిపోయినా, పలురకాల కష్టాలుమాత్రం మమ్మల్ని వదలిపెట్టలా. రైల్వేవర్కర్లూ, క్రింది తరగతి ఉద్యోగస్థులూ, సహించరాని పరిస్థితులలో పనిచేయవలసి వచ్చేది. ఈ కష్టాలవల్ల మానసికంగా ఎంతో బాధపడేవాడిని. కుటుంబ పరిస్థితులమీద కూడా విసుగుపుట్టింది. వీటినుండి బయటపడి, మనశ్శాంతిపొందాలని, నా భార్యను, నాతో కలిసి యోగాభ్యాసం చేసిన నా మిత్రుణ్ణి వెంటబెట్టుకుని, అరుణాచలంవెళ్లి, అరవిందాశ్రమంలోజేరాను. మూడుమాసములు గడిచే టప్పటికి మాబంధువులు వెదుక్కుంటూ వచ్చి మమ్మల్ని ఇంటికి (బిట్ర గుంట) తీసుకువచ్చారు.

కొన్నాళ్ళయిన తరువాత కామ్రేడ్ కె.యల్. నరసింహం, బి.ఎ. గారు బెజవాడనుండి వచ్చి నాతో సంబంధంపెట్టుకున్నారు. బిట్రగుంటలో రైల్వే వర్కర్సు అండ్ ఎంప్లాయీస్ యూనియన్ శాఖను నిర్మించాలనీ, యూనియన్‌ద్వారా మాత్రమే రైల్వేవర్కర్ల కష్టాలు తొలిగించగలమనీ చెప్పారు; లోగడ 1926 సం॥ ప్రాంతాలలో శ్రీ వి. వి. గిరి, కాలప్ప గార్లు నిర్మించిన యూనియన్ ఒకటి బిట్రగుంటలో వుండేది. కానీ 1927 సం॥లో కార్మికులు దెచ్చిన 'సమ్మె' పోరాటాన్ని నాయకత్వం ఉపసంహ రించడంతో యూనియన్ పనిచేయకుండా పోయింది. తిరిగి యూనియన్‌ను పునరుద్ధరించడానికి తీవ్రంగా కృషిచేశాను. యూనియన్ వ్యవహారాలలో బాగా పనిచేస్తూ. అనేక సమస్యలమీద కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజరుతో చర్చిస్తూ వుండేవాణ్ణి. క్రమంగా మా చర్చలు యూనియన్ సమస్యలు దాటి పార్టీ పాలసీలోకి వెళ్లాయి. హెచ్చు-తగ్గులూ, కష్టాలు - దోపిడీలూ; లేని సమాజంకోసం పాటుబడుతోంది కమ్యూనిస్టుపార్టీ యని చర్చలవల్ల తేలింది. మార్క్సిజమంటే అభిమాన మెక్కువయింది. నేనూ, నాతో యోగాభ్యాసం చేసిన స్నేహితుడూ కలిసి, చాలా మార్క్సిస్టు గ్రంథాలు చదివాం. మానవులంతా సమానమేననే ఆదర్శాన్నీ, అలాంటి మానవ సమాజాన్ని స్థాపించగలిగే మార్గాన్నీ, కమ్యూనిజంలో చూడగలిగాం. వెంటనే మే మిద్దరం కమ్యూనిస్టుపార్టీ సభ్యులమయ్యాం.

1937 సంవత్సరపు అసెంబ్లీ ఎన్నికల్లో, కాంగ్రెసు విజయంకోసం తీవ్రంగా ప్రచారం చేశాను. తరువాత 1939 సంవత్సరంలో, త్రిపురీ కాంగ్రెసు మహాసభకు వెళ్లాను. నాయకులిచ్చిన ఉద్రేకపూరిత ఉపన్యాసాలు విన్నాను; ఆచరణలో అనేకమంది నాయక శిఖామణులు అతివాదులకు వ్యతిరేకంగా, తమ తీర్మానాలు నెగ్గించుకోవడానికిచేసిన పన్నాగాలు చూచాను. కాంగ్రెసు నాయకులంటే విరక్తిపుట్టింది. ఆ మహాసభలోనే కమ్యూనిస్టునాయకుల్ని కలుసుకోగలిగాను, వారితో సంభాషించేభాగ్యం కలిగింది. తరువాత నూరు రూపాయలుబెట్టి మార్క్సిస్టు గ్రంధాలు కొని తెచ్చుకున్నాను.—

త్రిపురీనుండి తిరిగివచ్చిన దగ్గరినుండీ, నేనూ, నా స్నేహితుడూ కలిసి యూనియన్ వ్యవహారాలలో తీవ్రంగా పనిచేయసాగాం. మేమూ, మా మిత్రులూ కలసి బిట్రగుంటలో బలీయమైన యూనియన్‌ను నిర్మించు కోగలిగాం. యూనియన్ ద్వారా, రైల్వేకార్మికుల ఎంప్లాయిల కష్టాల నెన్నిటినో పోగొట్టుకుని, అనేకహక్కులను సాధించుకో గలుగుతున్నాం.

ప్రపంచ ప్రజలందరికీ ఫాసిస్టు ప్రమాదం వచ్చిపడింది. ఫాసిస్టు జపాను భారతదేశపు సరిహద్దుల పైకివచ్చి కూర్చుంది. కాకినాడ, విశాఖ పట్టణాలపై బాంబులువిసిరింది. బొందిలో ప్రాణమున్నంతవరకూ ఫాసిస్టు జపానును ప్రతిఘటిస్తానంటున్నాడు పండిట్ నెహ్రూ. జాతీయ ప్రభుత్వం కోసం. దేశరక్షణకోసం తీవ్రంగా కృషిచేస్తోంది నా పార్టీ—కమ్యూనిస్టు పార్టీ. ఫాసిజాన్ని నాశనంచేసి దేశాన్ని రక్షించుకోవడం దేశభక్తు లందరి కర్తవ్యమూనని, రైల్వేమిలిటరీ యూనిట్సులో చేరాను.—

ఇంతలో యుద్ధావసరాలవల్ల రైళ్ళమీద వత్తిడి ఎక్కువైంది. రైళ్ళమీద ప్రయాణంచేయడానికి, ప్రజలనేకబాధలకు గురికావలసివచ్చింది. కరువు కాటకాలున్న ప్రదేశాలకు ఆహారపదార్థాలను చేరవేయడానికి. ప్రజ లందరికీ జీవితావసర వస్తువులను సరఫరా చేయడానికి, యుద్ధ ప్రయ త్నాలు కుంటుబడకుండా రవాణా సాగించడానికీ, తగినన్ని రైలుపెట్టెలూ, వాగన్లూ, ఇంజన్లూ లేవు. రవాణావత్తిడి హెచ్చినంతగా 'స్టాఫ్' కూడా పెరుగలేదు. వున్న రైళ్ళతోనే. యుద్ధావసరాలూ. ప్రజల అవుసరాలూ కూడా తీర్చవలసి రావడంచేత రైల్వేసిబ్బంది రాత్రింబగళ్లూ పనిచేయవలసి వచ్చింది. అయినా లెక్కచేయకుండా విరామ మెరుగని కృషి చేశాను. ఇంజన్‌ను తుడిచి బాగుచేయకుండానే యుద్ధానికి పూర్వం నడిపిన దూరం

కంటె, రెట్టింపుదూరం నడుపవలసి వచ్చింది. అందుచేత ఇంజన్లు చెడిపో సాగాయి. ఆవిధంగా చెడిపోకుండా ప్రతినూరుమైళ్ళ దూరం నడపగానే. సాధ్యమైనంతవరకూ ఇంజన్ కడిగి, తుడిచి బాగుచేసేవాళ్ళం. బొగ్గు కొరతను దాటడానికిగాను పెద్దపెద్ద బొగ్గుబండ్లను బాయిలర్‌లో పడవేయ కుండా, నలగగొట్టి చిన్నముక్కలను వేసేవాళ్ళం. అందువల్ల బొగ్గు వృధాగా చిట్టంకట్టిపోకుండా, ఎక్కువదూరం కలసివచ్చేది. ఇలాగే అన్ని విధాలా జాగ్రత్తగా పనిచేస్తూ, ఇంజన్లు చెడిపోకుండా కాపాడుకుంటూ, రవాణాలు కుంటుబడకుండా జేశాం. ఈ విధంగా దేశంయెడల, ప్రజల యెడల నాకున్న బాధ్యతలను నిర్వహించాను.

కాంగ్రెసు నాయకుల అరెస్టు తర్వాత, దేశంలో ఏర్పడ్డపరిస్థితుల నెదుర్కోవడానికీ, నాయకులను విడిపించుకొని, జాతీయప్రభుత్వాన్ని గుంజుకొని దేశాన్ని రక్షించుకోవడానికీ కమ్యూనిస్టుపార్టీ ఒంటరిగా నిలచి పోరాడవలసివచ్చింది. తన బాధ్యతల్ని జయప్రదంగా నిర్వహించడానికై, పెద్దమొత్తం డబ్బు కావలసివచ్చింది. మూడులక్షల నిధికై ప్రజలకు విజ్ఞప్తిచేశారు కామ్రేడ్ పి. సి. జోషి. వివిధజిల్లాలలో, సంస్థలలో పని చేస్తున్న కామ్రేడ్సుకు, ఎంతెంత మొత్తం వసూలుచేయాలో సూచనలిస్తూ బాధ్యతలను పంచింది ఆంధ్రకమిటీ. రైతులకు కూలీలకు, మహిళలకూ, విద్యార్థులకూ పేరుపేరున విజ్ఞప్తిజేశారు, కామ్రేడ్ సుందరయ్య. కాని మా రైల్వే కార్మికులను విడిచిపెట్టారు. మమ్మల్నికూడా విరాళాలివ్వమని ఎందువల్ల అడుగలేదో బోధపడలా. పార్టీ అడుగకపోతే మాత్రం మన బాధ్యత మనకుతెలియదా? అనుకున్నాను. వెంటనే నాశక్తికి తగినమొత్తం పట్టుకుని బెజవాడ వెళ్ళి, పార్టీఆఫీసులో జమకట్టాను. నాబాధ్యతను నేను నెరవేర్చినందుకు పార్టీ నాయకులు సంతోషించారు. నాధర్మాన్ని నేను నిర్వర్తించినందుకు సంతృప్తిపడ్డాను.

రైల్వేపనివారల యుద్ధభత్యాలను రాబట్టడం, కంట్రోలు ధరలకు ఆహారపదార్థాలూ, జీవితావసరవస్తువులూ సప్లయి చేయించడమూ, లంచ గొండితనాన్నరికట్టడం మున్నగు పనులను జయప్రదంగా చేయగలుగు తోంది మాయూనియన్. నా యోగాభ్యాస మిత్రుడిపుడు విట్రగుంట బ్రాంచియూనియన్ కార్యదర్శిగా పనిచేస్తున్నాడు. ఎం. అండ్ ఎస్. ఎం. రైల్వేవర్కర్సు అండ్ ఎంప్లాయీస్ యూనియన్ కేంద్రకార్యనిర్వాహక సభ్యుడుగా పనిచేస్తున్నాను నేను.

## పెదిరెడ్ల ముత్యాలు

> కార్మికులారా! ఏకము కండని పిలుపిచ్చింది
> కమ్యూనిస్టుపార్టీ-నేనా పిలుపందుకున్నాను

మాదొక సామాన్య కార్మిక కుటుంబం. మా కుటుంబంలోనివారంతా అల్యూమినియం కార్మికులే. ఏ షాహుకార్ల కంపెనీలోనో పనులు చేస్తూ వుండేవాళ్లు. తాము కష్టంచేయడం, యజమానులు సరియైన కూలీ యివ్వకుండా లాభాలు జుట్టుకోవడం చూశారు మావాళ్లు. కుటుంబంలోని వాళ్లంతా పని చేతనైనవాళ్లవడంవల్ల, కలసి పనిచేయడంద్వారా, తామే స్వయంగా కంపెనీ సాగించుకోవాలని నిశ్చయించారు. వెంటనే 5 వ తరగతి చదువుతూన్న నన్ను చదువు మాన్పించేసి. కంపెనీలో మట్టినలిపే పనికి నియమించారు.

కార్మికులు స్వయంగా కంపెనీ నడపడంచూచి సాహుకార్లు సహించారుకారు. ఎలాగైనా మా కంపెనీని నాశనం చేయాలని ఎత్తులు వేశారు. వాళ్లపోటీకితట్టుకోలేక మా కంపెనీ కూలిపోయింది. అంతటితో మేమంతా పూర్వములాగానే సాహుకార్లవద్ద పని చేయాల్సొచ్చింది.

యజమాన్లు మా కిచ్చే కూలి, మా తిండికీ, బట్టకే సరిపొయ్యేది కాదు. కష్టాలు కార్మికులపాలు. లాభాలు యజమాన్లపాలు. మే మెలాగ జీవించడము? ఏమార్గమూ కనపించేదికాదు. గట్టిగామాట్లాడామా; పనిలో మంచి ఉద్వాసన చెప్పేవారు. పరిస్థితులిలాగుంటే, పైన యుద్ధం వచ్చి పడింది. సరకుల ధరలన్నీ పెరిగిపోనాయి, మజూరీఐమాత్రం పెరిగినాయి కావు. కార్మికులంతా ఉపవాసాలుంటూ పని చేయవలసిన పరిస్థి ఏర్పడి పోయింది.

ఎటుజూచినా ఏమీ పాలుపోనాదికాదు. కార్మికులకష్టాలు పోగొట్టడ మెలాగనాయని ఆలోచించేను. అప్పటికే మా రాజమండ్రిలో కార్మిక సంఘాలు. రైతుసంఘాలు స్థాపించి పనిచేస్తున్న కమ్యూనిష్టులొచ్చి. అల్యూమినియం కార్మికులంతా కలసి సంఘం పెట్టుకోవాలనీ, సంఘ బలంతో పోరాడి హక్కులు సాధించగలమనీ చెప్పారు. పోరాటంలో తామన్నివిధాలా కార్మికుల కండదండగా వుంటామన్నారు.

సంఘం పెట్టుకోవడానికి ప్రారంభించగానే, ఎన్నో వ్యతిరేకాల నెదుర్కోవలసి వచ్చింది. ఆగస్టు ఘటనలు జరిగిపోనాయి. దానితో పోలీసులరాజ్య మేర్పడిపోయిన రోజులవి. మేమంతా కలసి సంఘం పెట్టుకోడానికి కలుసుకునేందుకు, ప్రచారం చేసుకునేందుకుకూడా అడ్డు లెట్టేసేవారు పోలీసులు. ఇక సాహుకార్ల కడుపుమంటకు అంతే లేక పోనాది. ఎంత వ్యతిరేకం జరిగినాసరే మేం బాగాకష్టించి అల్యూమిని యం కార్మిక సంఘాన్ని స్థాపించేం. నేను దానికి కార్యదర్శిగా వుండి పనిచేయసాగేను.

ఈవిధంగా సంఘ మేర్పడ్డతరువాత కార్మికులం కొన్నిహక్కులు సాధించుకోగలిగేం. కాని పూర్తిగా మా కోరిక లీడేరినాయికావు. బలీయ మైన ఉద్యమాన్ని నిర్మిస్తేనేగాని కార్మికుల హక్కులు పూర్తిగా నెర వేరవన్నారు కామ్రేడ్స్ బాలాజీదాస్, ప్రభాకరచౌదరిగార్లు. నూటికి మూరు మందినీ సంఘంలోకి తీసుకురావాలన్నారు. కార్మికులంతా ఏకంకావాలి. ఏకమై మన హక్కులను సాధించుకోవాలంటూ తీవ్రంగా ప్రచారం చేయ సాగేరు. వారితో కలసి పనిచేస్తూ ఎన్నోవిషయాలు తెలుసుకోగలిగాను. నూటికి నూరుమంది కార్మికులను సంఘంలోకి తీసుకురాడానికి పట్టుదలగా పనిచేసేను. అల్యూమినియం కార్మికుల్లంతా సంఘటితమయ్యేకొద్దీ, షాహు కార్ల ఆటలు కట్టసాగేయి. క్రమంగా నూటికి నూరుమంది కార్మికులూ సభ్యులుగాగల బలమైన యూనియన్‌గా, మా అల్యూమినియం కార్మిక సంఘం తయారైనాది. సంఘబలంతో యజమానులను లొంగదీసి సరి యైన మజూరీలూ, బోనసులూ సంపాదించాం.

కష్టజీవులారా! ఏకంకండు. కార్మిక కర్షకులారా! ఏకంకండు. అని కమ్యూనిష్టుపార్టీ యిచ్చే నినాదాల ప్రభావం నా కప్పుడు తెలిసింది. పార్టీనిగురించి బాగా తెలుసుకోవాలనే కోర్కె ఎక్కువైనాది. అందుచేత

పార్టీసాహిత్యం చదవడం, పార్టీసభ్యులతో చర్చించడం చేసేవాణ్ణి. పార్టీ యిచ్చే ఐక్యతాకార్యక్రమంపై నా కంతులేని విశ్వాస మేర్పడింది. తరువాత క్రమంగా పార్టీసభ్యుణ్ణి కాగలిగాను.

సంఘబలంతో బోనసులు సంపాదించగలిగినా, యజమాను లప్పు డప్పుడు తోకలాడిస్తూనే వుండేవారు. మజూరీలు మున్నగు వాట్లలో పేచీ పెట్టేవారు. ఇలాంటి ఆటలనరికట్టడం కోసరం అల్యూమినియం సహకార పరపతి సంఘాన్ని స్థాపించి అభివృద్ధి చేయగలిగేం. ఈ సహకార పరపతి సంఘంద్వారా కార్మికుల మెన్నో సౌకర్యాలు పొందగలిగే అవకాశాలేర్పడినాయి.—

ఈ విధంగా మమ్మల్ని అభివృద్ధికి తెచ్చిన కమ్యూనిస్టుపార్టీయంటే మా అల్యూమినియం వర్కర్లంతా ఎంతో ప్రేమిస్తారు. పార్టీ తమపార్టీగా భావిస్తారు. అందుచేతనే క్రామేడ్ సుందరయ్య ప్రజాశక్తి నిధికోసరం విజ్ఞప్తిచేయగానే మాఅల్యూమినియం కార్మికులమంతాకలసి రు 1116/-లు యివ్వగలిగాం. ఆవిధంగా కష్టజీవుల పత్రికయైన ప్రజాశక్తి దినపత్రిక యెడల మాకున్న ఆనందాన్ని చాటుకున్నాం.—

పార్టీయంటే కష్టజీవుల పార్టీయని మాత్రమేగాదు మేము తెలుసుకున్నది, కార్మికులారా! ఏకముకండని, పార్టీయిచ్చిన నినాదాన్ని జీర్ణించుకోగలిగాం. అందుచేతనే ఈనాడు మా రాజమండ్రిలోని జట్లకార్మికులంతా యజమానుల అక్రమాలకు గురై, గత్యంతరంలేక సమ్మె చేస్తోంటే, మా అల్యూమినియం కార్మికులంతా ఏకమై సంఘంతరపున రు 1116/-లు మా సోదర జట్లకార్మికులకిచ్చి సాయపడగలిగేం. అంతేగాకుండా సర్వవ్యాపిత సమ్మెకైనా సిద్ధపడి, జట్లకార్మికుల న్యాయమైన హక్కులు రాబట్టగలిగాం. కార్మికులంతాఏకమైతే మాషాహుకార్లూ, అధికార్లూమాత్రమేగాదు—కొండమీద కోతిగూడా దిగిరావలసిందే.—

## మానికొండ బుల్లెమ్మ

> స్వతంత్రపోరాటంలో సర్వస్వం ధారపోస్తున్న
> బిడ్డల కోసం ప్రాణాలర్పించింది
> మాక్సిం గోర్కి "అమ్మ".
> ఆమె మార్గాన్నే నేనూ అనుసరించదలచుకున్నాను

"నా బిడ్డకు బాగా విద్యాబుద్ధులు చెప్పించాలి. మంచి ప్రయోజకుణ్ణి చేయాలి." పదిహేను సంవత్సరాలక్రితం నా కెప్పుడూ యిదే వ్యాపకం. తండ్రి చనిపోయేనాటికి నా బిడ్డ అశుభం శుభం తెలియని పసికందు. ఎనిమిదెకరాల పొలం; ఇరవై వందల ఋణం మాకుంది. కుటుంబ పరిస్థితిని చక్కబర్చుకోవడం; కుమారునికి చదువు చెప్పించుకోవడం ఎలాగో తెలియక అయోమయంగా వుండేది. కౌలు గింజలు కాసినీ అమ్మితే ఖర్చులకే సరిపోయేది. ఇక ఋణం తీర్చడం మెట్లా? నా బిడ్డ ఒకయింటివాడైన నాడు "ఇదిగో నాయనా! నీ తండ్రి సంపాదించి యిచ్చిపోయిన గడ్డ కొరతపెట్టకుండా నీ చేతిలో బెట్టాను. నా చేతనైనంతవరకూ విద్యాబుద్ధులు చెప్పించి, నిన్నొక ఇంటివాణ్ణిగా చేశాను. ఇక మీ సంసారం మీరు చేసుకోండి." అని చెప్పాలనుకునేదాన్ని. అందుకోసం అనుక్షణమూ కృషిచేసేదాన్ని.

మా నందమూరు గ్రామం (కృష్ణాజిల్లా) అసలే కుగ్రామం. ఎలిమెంటరీ పాఠశాల మినహా, అక్కడింకేమీలేదు. చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా హైస్కూలులేదు. అందుచేత, నా కుమారునికి కొన్నాళ్లు పై వేటు చెప్పించి, తరువాత బందరు పంపించాను.

అసలే తండ్రిలేని బిడ్డ. అందులోనూ అతి గారాబంగా పెంచాను. అందుచేత నన్నొదిలిపెట్టి వుండడమంటే వాడికి బెంగ. దానికితోడు పూటకూళ్ల భోజనం పడక మొదలే నాదారుగా వున్నవాడు కాస్తా సీబుగారి పోవడం మొదలెట్టాడు. ఇక నా కెటూ పాలుపోక ఇంటికి తాళంబెట్టి బందరు వెళ్లాను. పల్లెటూరిలో పుట్టి, పల్లెటూరిలో పెరిగిన నా కా బస్తీలో ఏమీ తోచేదికాదు. మా అబ్బాయితోపాటు చదువుకునే కుర్రవాళ్ల మంచీ చెడ్డా కనుక్కోవడం, స్నానానికీ పానానికీ నీళ్లూ విట్రా అందించడం, అందర్నీ కలిపి చదివించడం చేస్తుండేదాన్ని. అందుచేత మా అబ్బాయి. స్నేహితులుకూడా నన్నెంతో ఆప్యాయనంగా "అమ్మా, అమ్మా!" అని పిలుస్తూ, గౌరవంగా మెలిగేవాళ్లు. నేనుకూడా వాళ్ళను కన్నబిడ్డల మోస్తరుగా చూచుకునేదాన్ని. ఈ విధంగానే బందరులో వున్నన్నాళ్లూ కాలం గడచిపోయింది.

1936 సం॥లో కాలేజీ విడిచిపెట్టి, 'పెటర్నరీకోర్సు' చదువడానికి మద్రాసువెళ్లాడు మా అబ్బాయి. అప్పటికి వాడికి బాగా యుక్తవయస్సు వచ్చింది. అంచేత బరువూ భారమూ వాడి కప్పగించి వేయాలని, మా దగ్గర బంధువులలోని అమ్మాయినితెచ్చి పెండ్లిజేశాను. కట్నాలు కాను కలకోసం ఆశపడి, నా అంతట నేను చేసిన సంబంధంకాదిది. చిన్ననాటి నుండీ వాళ్ళిద్దరూ ఒకర్నొకరు పెళ్ళి చేసుకోవాలనుకునేవాళ్లు. ఉభయుల వైపు పెద్దవాళ్ళమూ తప్పకుండా చేయాలనుకునేవాళ్ళం. ఇకనేం? అనుకున్నట్లు అన్నివిధాలా తగిన సంబంధం జరిగింది. పెండ్లి కాగానే, ఇక మీ భవిష్యత్తు మీరు చూచుకోండి బాబూ! అని పెట్టేబేడా అప్పగించేశాను.

కొడుకు మద్రాసులోను; నేనింటివద్దాను. సాంబారు భోజనం సరిపడుతోందో లేదో అబ్బాయికనే బెంగవేసేది. ఏమీతోచక కృష్ణా! రామా! అనుకుంటూ కాలం గడిపేదాన్ని. ఇరుగు పొరుగు స్త్రీలొచ్చి, నాకేమో మహా తెలుసుననుకొని, ఏదైనా పుస్తకం చదివి చెప్పమనీ, ఏవైనా పాటలు పాడమని వేధించుకుతినేవారు. నాకు తెలిసిందే అంతంత మాత్రం. చదువనూ వ్రాయనూ మాత్రమే నాకొచ్చు. అయినా ఏదో మంచీ చెడ్డా చదివి వినిపించేదాన్ని. భజగోవిందనామాలూ, కస్తూరి రంగరంగా పాటలూ, పాడేదాన్ని. బాగాపాడావు, మళ్ళీ పాడమనేవారు

కొంతమంది. అవును, ప్రూనులేని దేశంలో ఆముదపుచెట్టు మహావృక్షం కాదూ మరి?

ఈ కాలంలోనే అసెంబ్లీ ఎన్నికలూ, కాంగ్రెసు మంత్రివర్గాలూ వచ్చినై. దేశమంతటా రాజకీయచైతన్యం హెచ్చింది. విద్యార్థులు తమ హక్కులకోసం జోరుగా సమ్మెలు సాగించారు. దాంతో మా అబ్బాయి కూడా రాజకీయాలలో ప్రవేశించాడు. 'వెటర్నరీ కోర్సు' చదువుతూ చదువుతూ అకస్మాత్తుగా చదువుకు స్వస్తిచెప్పాడు. ఎప్పుడూ రాజకీయ పుస్తకాలు చదువడం, తనకు తెలిసిందంతా తన భార్యకు బోధించడం పనైపోయింది మావాడికి. క్రమంగా భార్యాభర్తలిద్దరూ కలసి దేశసేవలో నిమగ్నమయ్యారు.—

మా అబ్బాయి చదువు మానుకోవడమే కొంచెం కష్టమనిపించింది నాకు. పైగా కొడుకూ కోడలుకూడా నాకళ్లెదుట చిలుకా గోరంకుల్లాగా జీవించకుండా—దేశసేవ చేస్తామంటూ బయలుదేరడమేమిటా? అనుకునే దాన్ని. అయినా, వాళ్ళేమీ చిన్నపిల్లలుకాదుగా నేను చెప్పడానికి? వాళ్ళ యిష్టప్రకారం. వాళ్ళుచేస్తున్నారు. పైగా 'దేశసేవ' చేయడం మంచిదేగా? అయినప్పుడు నాకెందుకు. నేను మాట్లాడడం? అని మెదలకుండా వూరు కునేదాన్ని నేను.—

ఇంతలో యుద్ధం వచ్చిపడింది. కొడుకూ కోడలూ ఏవేవో కాగి తాలూ కరపత్రాలూ తీసుకురావడం. పంచిపెట్టడమంతా రహస్యంగా చేస్తుండేవాళ్ళు. కొంతమంది కమ్యూనిస్టులు రహస్యంగా వచ్చి మా అబ్బాయితో ఏవేవో మాట్లాడి పోతూ వుండేవారు. కారుచీకటుల్లో, జోరు వానల్లో రావడం, ఆ అర్ధరాత్రి సమయాల్లోనే తిరిగి మాయమవడం జరి గేది. ఒక్కొక్కప్పుడు, రెండుమూడు రోజుల పర్యంతం. మాయింట్లో రహస్యంగా వుండి ఏదో. అదేపనిగా చర్చించేవారు. "స్వాతంత్ర్యం సాధించాలి అందుకు మార్గాలేమిటి?" అన్న ధ్యాసతప్ప. వాళ్ళకింకొక ఆలోచనే వుండేదికాదు. ఎందుకు నాయనా మీరిలా కష్టపడడం? అంటే "స్వాతంత్ర్యం వూరికే వస్తుందటమ్మా?" అనేవారు. కాళరాత్రుల్లోపడి తిరుగుతారు, పురుగేమో? పుట్రేమో? కాస్త ప్రాణాన్నైనా కాపాడుకో వద్దా? అంటే "స్వాతంత్రంకోసం చచ్చిపోయినా ఫరవాలేదమ్మా"అని జవాబిచ్చేవారు. వాళ్ళౌర్యం వేపేది, వాళ్ళ త్యాగమూ, పట్టుదలాచూస్తే.

అంచేత అన్నపానాదుల విషయంలో వాళ్ళను కంటికి రెప్పలాగా చూచే దాన్ని.—

అప్పటికింకా నా కొడుకూ కోడలూ బహిరంగంగానే వుండగలుగుతున్నారు. కాని "ఏవేళకేమో? ఎప్పుడు రహస్యంగా పోవలసివస్తుందో? ఏమయిపోతారో?" అని బెంగగా వుండేది. ఒకనాడు మా అబ్బాయితో "ఏం? నాయనా? ఎందుకొచ్చిన కష్టమిదంతా? పోలీసులబారి పడకుండా, నీవూ నీ భార్యా రహస్యంగా వుండి పనిచేయగలరా? ఏమోర్నా... కేమీ తోచకుండావుంది అన్నాను. మారు మాటాడకుండా మాక్సిం గోర్కీ రాసిన "అమ్మ" చేతిలోపెట్టి, "ఇది చదువమ్మా!" అన్నాడు మా అబ్బాయి,

పుస్తకమంతా చదివాను. మళ్ళీ చదివాను. నేను మా అబ్బాయిని వేసిన ప్రశ్నలకు సూటిగా సమాధాన మున్నదందులో. పావెల్‌ను వాళ్లమ్మ కూడా యిలాంటిప్రశ్నలే వేసింది మొదట్లో. కాని పావెల్ ప్రారంభించిన ఉద్యమానికి ఆమే అండదండగా పనిచేసింది చివరకు. అదంతా గ్రహించాను. "గోర్కీ "అమ్మ" కు, పావెల్ ఒక్కడేకొడుకు. భర్త చనిపోయాడు. కష్టపడి కొడుకును చదివించుకుంది. ఉద్యోగం చేయించాలనుకుంది. కాని పావెల్ రాజకీయాలలో కురికాడు. పావెల్ ప్రేమించిన యువతికూడా వురికింది. వాళ్ల ప్రచురించే రహస్య కరపత్రాలు గోప్యంగా పంచిపెట్టేది "అమ్మ". చివరకు పోలీసుల లాఠీచార్జీలకు గురైంది. స్వతంత్రపోరాటంలోనే తన ప్రాణాలర్పించింది."—

అమ్మ జీవితాన్ని నా జీవితంతో పోల్చిచూచుకున్నాను. ఆమెకూ నాకూ ప్రధానమైనతేడా వకటి కనుపించింది. ఆమెలాగా నేను స్వతంత్ర పోరాటంలో పాల్గొనలేదు. అదేతేడా. తక్కినదంతా కొంచెమించు మించుగా సరిగానేవుంది. స్వతంత్రపోరాటంలో నేనుకూడా శక్తికొలది "అమ్మ" ను అనుసరించాలనుకున్నాను.-

ఆ నాటినుండీ మా యింట్లో రహస్య సమావేశాలు జరుగుతూంచే. బయట నేను రాత్రింబగళ్లూ కాపలా కాసేదానను. రహస్యకాగితాలూ కరపత్రాలూ, ఎక్కడనో దాచిపెడుతూవుండేదాన్ని. ఈ విధంగా రెండు సంవత్సరాలు గడచింది.-

దేశానికొక వైపున జపాను ప్రమాదమూ, వేరొకవైపున రాజకీయ సంక్షోభమూ కలిగాయి. కాంగ్రెసు నాయకులంతా అరెస్టయ్యారు. పార్టీ బహిరంగంగా పనిజేయగలుగుతోంది. కాని, ప్రజలకూ, పోలీసులకూ మధ్యనిలబడి నాయకులవిడుదలకోసం, జాతీయప్రభుత్వంకోసం, దేశరక్షణకోసం, పనిజేస్తూ విపరీతమైన కష్టాలు నెదుర్కొంటోంది పార్టీ. ఆ సమయంలో పార్టీ అవసరాలకోసం 5 లక్షలరూపాయలు కావాలని కామ్రేడ్స్ జోషి, సుందరయ్యగార్లు విజ్ఞప్తి చేశారు. వెంటనే నా కొడుకూ కోడలూ కలసి మా ఆస్తినంతా అమ్మేశారు. మొత్తం పదిహేనువేల రూపాయలొచ్చినయి. నాదగ్గరకొచ్చి మా అబ్బాయి "ఇదిగోనమ్మా నీవంతు ఐదువేలు. మా యిద్దరివంతు పదివేలూ పార్టీ కిచ్చివేస్తున్నాం. నీ డబ్బును నీ యిష్టంవచ్చినవిధంగా ఖర్చుపెట్టుకో" మన్నాడు. నా కెందుకులే నాయనా! మీలో భాగం పంచుకోవద మన్నాను నేను. కోడుకూ కోడలూ కూడా నామాట వినిపించుకోకుండా "నీవేగదమ్మా! ఈ ఆస్తిని మా కిచ్చింది. నీకులేకుండా మాకుమాత్ర మేముంది. కాబట్టి నీవంతు నీవు తీసుకో" అని ఐదువేలూ బలవంతంగా నా చేతిలో పెట్టారు. వారిద్దరి పదివేలూ పార్టీకిచ్చారు. ఇక మాకు మిగిలింది కొంచెం మెరకపొలం మాత్రం. మా నందమూరు గ్రామంలో స్త్రీలకు బయటకు వెళ్ళడానికి చాలాయిబ్బందిగావున్నందున. మరుగుదొడ్లకోసం మామెరకపొలం కాస్తా గ్రామ మహిళాసంఘాని కిచ్చివేశాం.

జిల్లా మహిళాసంఘాధ్యక్షురాలుగా పని జేస్తోంది నా కోడలు సూర్యావతి. జిల్లా కమిటీమెంబరుగా పార్టీని నిర్మిస్తున్నాడు నా కుమారుడు సుబ్బారావు. ఇప్పుడు రహస్య కరపత్రాలు దాచేపని నాకేమీ లేదు. అందుచేత నేనుకూడా మహిళాసంఘాలలో పనిచేయసాగాను గన్నవరం తాలూకా మహిళాసంఘాధ్యక్షురాలుగా కొంతకాలం పనిజేసాను.

ఇంతలో బెజవాడలో రాష్ట్రపార్టీకాన్ఫరెన్సు ప్రారంభమైంది. నన్నుకూడా కాన్ఫరెన్సు చూడడానికి ఆహ్వానించింది పార్టీ. నా కొడుకూ కోడలూ కూడా ప్రతినిధులుగా సభకొచ్చారు. వివిధప్రజా సమస్యలపై జరిగిన చర్చలన్నీ విన్నాను. సభ్యులందరిలోనూ స్వాతంత్ర్యకాంక్ష ఎంత దృఢంగా వున్నదో చూచాను. నాకొడుకూ కోడలూమాత్రమేగాక వేలాది పార్టీసభ్యు లెలా దేశంకోసం త్యాగాలు చేస్తున్నదీ తెలుసుకోగలిగాను. సభ

పూర్తియైన తరువాత కామ్రేడ్ సుందరయ్య "సభలో జరిగిన విషయాలన్నీ తెలుసుకున్నావు. వాటిపైన నీఅభిప్రాయమేమిటో సభలో చెప్పమ" న్నాడు. వెంటనే నేను "స్వాతంత్ర్యంకోసం, వివిధ ప్రజాసమస్యల పరిష్కారంకోసం మీరు తీసుకున్న నిర్ణయాలన్నీ నా కెంతో నచ్చినయి. స్త్రీల అభివృద్ధిపైననే జాతి భవిష్యత్తు ఆధారపడివుంటనీ, అందుకోసం పార్టీ శక్తివంచనలేని కృషిచేయాలనీ నిర్ణయించడం నాకు మరింత సంతోషాన్ని కలిగించింది. నా సంతోషానికి ప్రతిఫలంగా పార్టీనిధికి వేయి రూపాయ లిస్తున్నాను. అంతేగాకుండా నేకుకూడా పార్టీలోచేరి పని చేయదలచుకున్నాను" అని సభలో చెప్పాను. సరేనంది పార్టీ. ఎంతో సంతోషమైంది నాకు.

విరామమెరుగని ప్రజాసేవలో పార్టీసభ్యులు ఆరోగ్యాన్ని కోల్పోగారు. పూటకూళ్ళ భోజనాలవల్ల ఆరోగ్యాలు మరీ చెడిపోతున్నాయి. కాబట్టి రాష్ట్రపార్టీ కేంద్రమైన బెజవాడలో వుండి, సరిగా అన్నపానాదులు సమకూరుస్తూ పార్టీ సభ్యుల ఆరోగ్యాన్ని కాపాడడం నా విధిగా భావించాను. అందుచేత రాష్ట్రకమిటీ కమ్యూన్ (అందరూ కలసి వంటచేయించుకునే భోజనశాల) లో వుండి రాష్ట్రఆఫీసులో పనిచేసే పార్టీసభ్యుల ఆరోగ్యాన్ని కాపాడేబాధ్యత తీసుకుని పనిజేస్తున్నాను.—

ఈనాడు మా అబ్బాయిఆరోగ్యాన్ని కాపాడడంమాత్రమేనావనికాదు. నాకొడుకుల్లాంటి వాళ్ళైయైన రాష్ట్రపార్టీ అగ్రనైజర్ల ఆరోగ్యం కాపాడడం నా విధి. నేనా విధిని నిర్వహిస్తున్నాను కొంతమంది పార్టీసభ్యులు నన్ను "మాక్సింగోర్కీ 'అమ్మ' లాంటిదానివమ్మా" అంటారు. గోర్కీ 'అమ్మ' ఎక్కడ? నే నెక్కడ? ఆమె స్వతంత్ర సమరంలో ప్రాణాలర్పించింది. మరి నేనో? .... .... .... ప్రయత్నిస్తాను.—

## సుంకర సత్యనారాయణ

> సమిష్టి పోరాటంద్వారా స్వాతంత్ర్యం
> సాధించాలనే - కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం
> నన్నాకర్షించింది

సత్యాగ్రహ సందేశం దేశం నలుమూలలా మారుమ్రోగుతున్న రోజులవి. మహాత్మాగాంధీ నాయకత్వాన స్వరాజ్యపోరాటం నిరాఘాటంగా ఉరవళ్ళు పరవళ్ళు దొక్కుతూ ముందుకుసాగిపోతూవుంది. మెల్లమెల్లగా స్వతంత్ర వాయువులు మేలుకొలుపులుపాడాయి. తరతరాలనుండీ బానిసత్వ మనే కారుచీకటిలో మగ్గిపోయిన భారతజాతి కండ్లుదెరచింది. తన జన్మ హక్కు అయిన స్వరాజ్యాన్ని సాధించడానికి. కార్యదీక్షతో కటిబద్ధమై కర్మక్షేత్రంలోకి వురికింది స్వతంత్ర శంఖారావం బస్తీ సరిహద్దుల్ని దాటి మారుమూల పల్లెలవరకూ ప్రతిధ్వనించింది.—

వెంటనే బెజవాడలోకూడా ఢంకా బజాయించారు. ఉప్పుకొఠారుల మీదికి దండయాత్ర సాగింది. ప్రథమ సత్యాగ్రహదళం బందరుకు బయలు దేరింది, మార్గమధ్యంలోవున్న మా 'ఈడ్పుగల్లు' గ్రామంలో ఒకమీటింగు ఏర్పాటుచేశారు. "స్వతంత్రమైనా సాధించాలి, లేక నా శవం సముద్రంలో నైనా తేలాలంటున్నాడు మహాత్ముడు. కాబట్టి సత్యాగ్రహ సమరంలో చావో ? బ్రతుకో ? తేల్చుకోవాలి రండ" ని పిల్చిందాదళం. నా ఒళ్ళు జలదరించింది. మహాత్ముడావిధంగా శపథం పట్టినతరువాత మన ప్రాణాలు దాచుకోవడం సిగ్గుచేటనుకుని, దళంలో కలిశాము వెంటనే మా తండ్రిగారు "నాయనా! నీవు యువకుడవు. యువకుల ఉద్రేకాలు

చితుకులమంటలు వెంటనే చల్లారిపోతాయి, మరమ ద్రిప్పకుండా ముంద డుగు వేయదలచుకుంటేనేవెళ్ళు. లేకపోతే ఇంటిదగ్గర ఉండు. నీ బదులు సత్యాగ్రహ సమరంలోకి నే వెళతాను" అంటూ ముందు కొచ్చారు. అలా వీల్లేదు నేనే వెళతానంటూ మా తండ్రిగారితో పోటీపడ్డాను. చివరకు "సరే వెళ్ళు. కుటుంబానికి మాత్రం అప్రతిష్ట తేవద్దు పోలీసు కాల్పులకు భయ పడి పారిపోయి ఇంటికొచ్చావా? నేనే కాల్చివేస్తాను. జాగ్రత. జ్ఞాపక ముంచుకో" అన్నాడు మాతండ్రి. గాంధీగారి పిలుపునూ—తండ్రిగారి హెచ్చరికనూ అందుకుని; సత్యాగ్రహసమరానికై కదంత్రొక్కే దళంలో కలిసిపోయా.—

ఇంటిదగ్గర మాతండ్రిగారు వూరికే కూర్చోలా. మా కుటుంబా న్నంతా దేశభక్త కుటుంబంగా తయారుచేశారు. ఇంతలో ప్రభుత్వ శాస నాలను ఉల్లంఘించి నేరం చేశానంటూ, నాకు మూడుసంవత్సరాలు కఠినశిక్ష విధించింది ప్రభుత్వం. నన్ను ప్రభుత్వం జైలుకు పంపించగానే నాతమ్ముళ్ళిద్దరు ముందుకువచ్చి నాస్థానాన్ని ఆక్రమించారు. పెదతమ్ముడు వీరభద్రరావు నాలుగుసార్లు తీవ్రమైన లాఠీఛార్జీలకు గురై, తరువాత సైజాంలో తొమ్మిదిమాసాలు జైలుబాధననుభవించి వచ్చాడు. రెండో తమ్ముడు సుబ్బారావుకూడా జైలుకువెళ్ళాడు. ఈవిధంగా కుటుంబభారాన్ని తాను వహిస్తూ మమ్మల్ని దేశసేవ కర్పించగలిగారు మాతండ్రిగారు.

గాంధీ - ఇర్విన్ ఒడంబడికతో బయటికి వచ్చాను ఒడంబడిక భగ్నమై తిరిగి పోరాటం ప్రారంభమైంది. శక్తివంచనలేకుండా పోరాట సాగాను. ఈమారు ప్రభుత్వం విచ్చలవిడిగా లాఠీఛార్జి చేస్తోంది. రెండు మార్లు తీవ్రమయిన లాఠీ ఛార్జీలకు గురిచేసి, తరువాత 1932 లో అరెస్టు చేసి సంవత్సరం కఠినశిక్ష విధించింది ప్రభుత్వం. జైల్లో హిందీ నేర్చు కుంటూ సంవత్సరకాలం గడిపి బయటికి వచ్చాను —

నేను బయటికి వచ్చేటప్పటికి సత్యాగ్రహసమరంనాటి ఆవేశం ప్రజల్లో ఎక్కడా కనుపించలేదు. తీవ్రమయిన ఆర్థిక మాంద్యంతో అవ స్థల పాలయ్యారు ప్రజలు. ఎన్నికలవైపు దృష్టిసారించారు కాంగ్రెసు నాయకులు అన్నివైపులా ఆవరించిన ఆర్థికమాంద్యంతో మాకుటుంబ పరిస్థితులు కూడా తారుమారయ్యాయి. మా భూముల్ని చాలావరకు అప్పులవాళ్ళు కాజేశారు. ఏమిచేయడానికి పాలుపోలా. చివరకు ఎలా

గయినా కష్టపడి విద్యసాధించాలనే పట్టుదలతో అలహాబాదు వెళ్ళాను. ఆర్థికంగా అనేక కష్టాలకు గురయ్యాను. తరుచు ఉపవాసాలు చేయవలసి వచ్చినప్పటికీ విడిచి పెట్టకుండా హిందీలో విజ్ఞానాన్నిసాధించి మరీవచ్చాను.

రాష్ట్రశాసనసభకు ఎన్నికలొచ్చాయి. కాంగ్రెసు విజయానికై శక్తి వంచనలేకుండా కృషిచేశాను. మంత్రివర్గాలు స్థాపించింది కాంగ్రెసు. జమీందారీ బాధలనుండి, జమీన్ రైతులు రక్షింపబడతారనీ, రైతుల, కూలీల కష్టాలు కడతేరుతాయనీ ఆశించాను. కాని కాంగ్రెసు మంత్రివర్గం ఋణబాధా నివారణ చట్టాన్ని మసిబూసిన మారేడుకాయవలె చేయడంతో కండ్లుతెరిచాను. అధికారంలోవున్నది కాంగ్రెసు మంత్రివర్గమే అయినప్పటికీ, మనం పూరికేకూర్చుంటే లాభం లేదనుకున్నా. జమీందారీ చట్టం కొరకు తీవ్రంగా కృషిచేయాలనిపించింది. కాని కష్టాలపాలై వుంది మా కుటుంబం. నేనుకూడా కుటుంబబాధ్యతల్ని కొంతవరకూ పంచుకోవలసి వచ్చింది. అంచేత నూజివీడుతాలూకావెళ్ళి కొన్నాళ్లు వ్యవసాయం జేసీ, మరికొన్నాళ్ళు బాడుగబండ్లు తోలుకొనీ, చివరకు రమణక్కపేటలో హిందీపాఠాలు జెప్పుకునీ, కుటుంబాన్ని పోషించుకుంటూ, సాధ్యమయినంతవరకూ జమీందారీ రైతులహక్కులకోసం పనిజేస్తూ వచ్చాను. ఇంతలో ఎన్నికలప్రణాళికకు వ్యతిరేకంగా కాశీపట్నం, మునగాలరైతులపై లాఠీచార్జీచేసింది కాంగ్రెసు మంత్రివర్గం. కాంగ్రెసు నాయకత్వం మీద నాకున్ననమ్మకం కాస్తాపోయింది.

'కోట్లకొలదిమానవుల్ని బలిగొనే ప్రపంచసంగ్రామాన్ని తెచ్చిపెట్టింది సామ్రాజ్యవాదం. ప్రకాశంకమిటీ రిపోర్టు మఖలోనే మాడిపోయింది. అదునుజూచుకుని రైతులమీదికి వేటకుక్కల్లా విజృంభించారు జమీందార్లు. కమ్యూనిస్టులూ, ఇతర అతివాదులూ జమీందారీ రైతుల హక్కులకోసం పోరాడసాగారు. ఇంతలోనే గాంధీగారి వ్యక్తిసత్యాగ్రహకార్యక్రమం వచ్చింది. ప్రజలంతా విపరీతమైన కష్టాలనుభవిస్తూంటే, ప్రజలమధ్య నిలబడి వారిహక్కులకోసం పోరాడకుండా, మనంతట మనమే స్వచ్ఛందంగా — బ్రిటిష్ ప్రభుత్వానికేమీ యిబ్బందికలిగించకుండా — జైలుకువెళ్ళి కూర్చునేకార్యక్రమం నాకు నచ్చలా. సమిష్టి పోరాటంద్వారా తక్షణం స్వాతంత్ర్యం సాధించాలనే కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమం నన్నాకర్షించింది. కమ్యూనిస్టులతో కలిసిపనిచేస్తూ చివరకు

1941 సం॥లో కమ్యూనిస్టుపార్టీలో చేరాను. కొణతమాత్మకూరులో హిందీటీచరుగా వుంటూనే. రైతుల్లోనూ కూలీలలోనూ పని చేసేవాణ్ణి.

ఇంతలో ఫాసిస్టుజర్మనీ. కూలీరైతుల రాజ్యమైన సోవియట్ రష్యాపై దొంగపోటు పొడిచింది. ప్రపంచాధిపత్యానికై కలలుగంటున్న ఫాసిస్టుజర్మనీని ప్రాణాలొడ్డి ప్రతిఘటించసాగారు సోవియట్ ప్రజలు. రష్యాభవిష్యత్తు—ప్రపంచప్రజల గతి—ఏమవుతాయో ? అనే ఆందోళన నన్ను కలిచివేసింది. స్టాలిన్‌గ్రాడువద్ద రెడార్మీ వీరోచితంగా పోరాడి. ఫాసిస్టు దుండగీడులను నాశనంచేయడంతో. ప్రపంచప్రజలకు ఆశాజ్యోతులు కనుపించాయి. యుద్ధగతి ఫాసిస్టు బందిపోటు దొంగలకు వ్యతిరేకంగామారింది. ఇక నా సంతోషానికి మేరలేదు. వెంటనే "స్టాలిన్‌గ్రాడుదాక సాగిరానిచ్చి నిన్ను. ఎర్రసేన చుట్టుముట్టి. గొర్రె కోతకోయుచుండ హిట్లరూ !-అబ్బ ! నా కళ్లు చల్లబడ్డవోయి హిట్లరూ!" అనే గీతాన్నీ. "ఓ—మిట్టిపడే హిట్లరయ్యా ! ఏటికే ఎమరీమచుంటివా?" అని మరోగీతాన్నీ వ్రాశాను. ఆ రెండు గీతాలూ అనేకమంది రైతులూ. కూలీలూకూడా పాడసాగారు. పరవాలేదు; నేనుకూడా కాస్త కవిత్వం రాయగలననుకున్నా. వెంటనే జమీందారీ ప్రజలకు కష్టసుఖాలలో చాలా కాలంనుండీ పాల్గొంటున్న వాడనవడంచేత. ఆ అనుభవంతో 'కష్టజీవి' యనే బుర్రకథను వ్రాశా. ప్రజానాట్యమండలివారి వైజ్ఞానిక దళాలన్నీ. ఈ కథను ప్రజల్లో విరివిగా చెప్పసాగాయి ఆంధ్రరైతాంగం తలలూపింది. అందుచేతనే ఇంతవరకూ 'కష్టజీవి' ముప్పదివేల కాపీలు అచ్చు వేయవలసి వచ్చింది.-

ఇది జరిగినతరువాత; కవి తన రచనలద్వారా ప్రజానీకాన్ని ఎలా చైతన్యవంతులుగా చేయగలుగుతాడో తెలిసింది. నవ్యయుగ నిర్మాతయైన వీరేశలింగం పంతులుగారి జీవితాన్నీ. ఆశయాలనూ. ప్రజాసామాన్యానికందజేయాలని. పంతులుగారి జీవితఘటనల్ని. బుర్రకథగా వ్రాశాను. ప్రజావైజ్ఞానికదళాలీకథను చెపుతూంటే. పండితులనుండి పామరుల వరకూ. పంతులుగారి ఆశయాలనువిని. ఆనందాతిశయంతో పొంగిపోతున్నారు.-

ఇంతలో దేశమంతటా కరువులు. కాటకాలు చెలరేగాయి. సోదర రైతుకూలీలను హలముబట్టి అధికపంటలు పండించి, ప్రజలకంద

జేయాలని ప్రబోధించడానికై నేను కలంబట్టాను. "పచ్చ పచ్చగ బెరిగి పండి ఒరిగున్నాను—ప్రజకు నన్నందించరావా? నారైతా! ప్రళయమౌ కరువాపలేవా?" అంటూ గీతాలనూ, 'ఆహుతి' అనేహరికధనూ వ్రాశాను. కరువుకాటకాల నరికట్టడానికీ, దేశాన్ని రక్షించుకోవడానికీ, కాంగ్రెసు నాయకులు విడుదల కావాలంటూ గీతాలు వ్రాశాను.

నాయకులు విడుదలయ్యారు. సిమ్లా సమావేశం ఏర్పాటు చేయబడింది. కాంగ్రెసు నాయకులూ—లీగు నాయకులూ కలసి, జాతీయప్రభుత్వాన్నేర్పరచి కరువుకాటకాల నరికట్టి, ప్రజలను రక్షించగలుగుతారని ఆశించాను. కాని నాయకులమధ్య జరిగిన కొట్లాటలతో, వేవెలు ధర్మపన్నాలుమాత్రం వినవలసి వచ్చింది. నా నడుం విరిగిపోయింది. "తిరిగి వచ్చారా? బాబూ? తిరిగి వచ్చారా? పరువు మర్యాదలను సిమ్లాపాలుజేసియు రిత్తచేతుల తిరిగి వచ్చారా?" అనేగీతంలో నా హృదయావేదనను వెళ్ళబోసుకున్నా.—

ఈ మధ్యకాలంలోనే ప్రజా నాట్య మండలివారి ప్రోత్సాహంతో, "ముందడుగు" నాటకాన్ని కామ్రేడ్ వాసిరెడ్డి భాస్కరరావుగారితో కలిసి వ్రాశాను. ఇంకా నాటకాలూ, కధలూ వ్రాస్తున్నాను. అనేకమంది పెద్దలు 'ప్రజాకవి' వనీ గొప్పవాడివనీ, ఈనాడు నన్ను పొగడుతున్నారు. కాని వారందరికీ, నేనొక విషయాన్ని విన్నవించుకోదలచుకున్నాను. అదేమంటే "నే నేమీ పెద్దపండితుణ్ణి కాదు. నే నొక రైతుబిడ్డను మాత్రం. ఇరువది సంవత్సరాల వయస్సు వచ్చేవరకూ, నాగలి బట్టడంతప్ప నాకింకేమీ చేతనయ్యేదికాదు. పిమ్మట స్వతంత్ర పోరాటంలో, ప్రజలమధ్య పనిజేస్తూ, ప్రజల జీవిత సమస్యలను అర్ధంచేసుకోగలిగాను. తరువాత నా పార్టీ—కమ్యూనిస్టుపార్టీ—నా కిచ్చిన విజ్ఞానంవల్ల మాత్రమే. నే నిలాంటి కధలూ నాటకాలూ వ్రాయగలుగుతున్నాను. అంతే. అంతకంటే, నాలో గొప్పదనమేమీ లేదు" అని.—

నే[illegible] పార్టీ[illegible] పనిచేస్తోంటే, మా తండ్రిగారు గాని, మా కు[illegible]లోని ఇతరులుగాని [illegible]కబడలా. ఈనాడు నా తమ్ములు ముగ్గురూ[illegible] చెల్లెలూ, తండ్రీకూడా పార్టీ[illegible]యులుగా పనిచేస్తున్నారు. 1930వ సంవ[illegible]నాటి కాంగ్రెసు కుటుం[illegible]—ఈనాడు కమ్యూనిస్టు పార్టీ కుటుం[illegible]—

• పుస్తకం చదివారు కాని

భారత కమ్యూనిస్టు పార్టీలో,

వివిధ రాష్ట్రాలలో

ఎలాటి దేశభక్తులు, వీరులున్నారు ?

భారత కమ్యూనిస్టు పార్టీలో

ఎలాటి వీరోచిత, స్వాతంత్ర్య సమర

సాంప్రదాయాలున్నాయి ?

## వీటిని ప్రతి దేశభక్తుడూ తెలుసుకోవాలి

**అందుకు చదవండి :**

| | | | |
|---|---|---|---|
| భగత్‌సింగ్ వీరులు | 0 | 6 | 0 |
| గదర్ వీరులు | 0 | 10 | 0 |
| చిట్టగాంగు విప్లవ వీరులు | 1 | 0 | 0 |
| పృధ్వీసింగు | 0 | 12 | 0 |

